# శ్రీ లలితానామ సహస్రార్థము

ప్రథమ ముద్రణ : జూన్, 2000
వెల : రూ॥ 40/-
ప్రతులు : 500

ముఖచిత్రం : శ్రీమతి జె. రాజ్యలక్ష్మి

ప్రతులకు : జె.ఎన్.ఆర్.కె. ప్రసాద్, యమ్.యస్.సి.,
15-25/2, శ్రీ కోదండరామనగర్,
దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్ - 500 060.
ఫోన్ : 4061241

Printed by :
VIJAYALAXMI PRINTERS
D.No. : 7-80/10, Road No.3,
Madhurapuri, Dilsukhnagar,
Hyderabad - 500 060.
Phone : 4064561

శ్రీమత్త్రిపురసుందరి
శివశక్త్యైక్య రూపిణి
శ్రీ లలితామాత పదాంబుజములకు -

అంకితం

"భారత్ బాషాభూషణ్"
డా॥ ఆచార్య తిరుమల,
301, నందిని కాంప్లెక్సు,
మోజంజాహి మార్కెట్,
హైదరాబాద్ - 95.
ఫోన్ : 4619066

# అర్థగౌరవం !

మన కెన్ని తెలివి తేటలున్నా భగవతత్త్వం తెలియనిదే పరమ చరమ లక్ష్యం సిద్ధించదని పరమ యోగుల ఆప్తోపదేశం. ఆ లక్ష్య సిద్ధికై మహా జ్ఞానులు చేసిన ప్రయత్నంలో నుండే వైదిక వాఙ్మయం వెలువడింది. "సర్వం వేదాత్ప్ర సిద్ధ్యతి" అన్నాడు మనువు. "బ్రహ్మైవై సర్వస్య ప్రతిష్ఠా" అన్నది వేదం. "ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" అని ఇతిహాస పురాణాలన్నీ వేదానికి ఉపబృంహణాలు. సృష్టి రహస్య భేదనం చేసే పురాణాల్లో ప్రతిష్ఠితమైన దేవతా ప్రాణాధ్యానం ఒక జ్ఞాన యజ్ఞం. అందులో శ్రీ లలిత బ్రహ్మాండ పురాణాంతర్గత మహా మాయా స్వరూపిణి. ఆ మహా శక్తిని గూర్చి "అహంత్వా సర్వ పాపేభ్యో మోక్ష ఇష్యామి మాశుః" అని ఢంకా బజాయించి చెప్పిన శ్రీ కృష్ణ భగవానుడు కూడా "నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః" అంటున్నాడు. ఇంతకీ 'మాయ' అంటే ఏమిటి ? "మీయతే అనయా - మినోతియా - మాయా" - అఖండ పరబ్రహ్మ తత్త్వాన్ని ఖండాయమానంగా చేసి విశ్వ రూపంగా ప్రదర్శించే మహాశక్తి. ఆ శక్తి యొక్క లాలిత్య దర్శనమే శ్రీ లలిత. ఆమె యొక్క సాకార, నిరాకార నిగూఢ తత్త్వ దర్శనమే శ్రీ లలితా సహస్రనామ స్తోత్రం. సహస్రారంలో తప్ప యీ నామార్థాలు వికసించవు. అనుభూతిరూపంలో హృదయంలో తప్ప పరిమళించవు. ఒక్కొక్క నామానికి ఒక్కొక్క తత్త్వ చరిత్ర ఉంటుంది.

ద్వే విద్యే వేదితవ్యే శబ్ద బ్రహ్మ పరం చయేత్
శాబ్దే బ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధి గచ్ఛతి !!

అని ఉపనిషద్వాణి. శబ్దం ద్వారానే అర్థ సాక్షాత్కారం. అందుకు నామ పరిచయం, పారాయణం పూజావిధానంలో ప్రముఖమైన అంశాలయ్యాయి.

కవిగా, విమర్శకుడుగా, వ్యాసకర్తగా గుర్తించబడిన కృష్ణప్రసాద్ వేదాంత విద్యారంగంలో స్థిరపడుతున్నాడు. తాత్త్వికాంశాలు చాలా తెలుసుకుంటున్నాడు. తనకు తెలిసిన విషయాలు, తను పొందిన ఆనందానుభూతులు నలుగురికి పంచుతున్నాడు. ఆదర్శవంతమైన జీవితాన్ని గడుపుతున్నాడు.

ఈ 'శ్రీ లలితా నామ సహస్రార్థం' కృష్ణప్రసాద్ బుద్ధిమల్లక్షణానికి అక్షరశః లక్ష్యం. వైదిక శబ్దాలకు నిరుక్తి ఆధారంగా అర్థాలు చెప్పాలి. లేకపోతే సామాన్యార్థాలే గానీ విశేషార్థాలు తెలియవు. ఆ ఆనంద మార్గాలు అందవు. కృష్ణప్రసాద్ చెప్పిన అర్థాలు చాలా భాగం యదార్థంగానే ఉన్నాయి. విశేషార్థాలతో వివరించాలంటే ఒక్కొక్క నామం ఒక్కొక్క గ్రంథమవుతుంది.

ఉదాహరణకు లలితాదేవికి 'మాయ' అనే పేరుంది.

ఆ మాట -

న సతీసా నా సతీసా నోభయాత్మా విరోధతః
కాచిద్విలక్షణా మాయా వస్తుభూతా సనాతనీ !!

అనే శ్రుతి ప్రమాణం తెలియక పోతే అర్థం కాదు. ఏది ఏమైనా కృష్ణప్రసాద్ చేస్తున్న కృషి ప్రశంసనీయంగా ఉంది. అతని అర్థ గౌరవం వాంఛనీయంగా ఉంది. అన్న ప్రాశన నాటి పరమాన్నం లాంటి యీ గ్రంథాన్ని అందిస్తున్న ప్రసాద్‌ని అభినందిస్తూ -

ఆ లలితాదేవికి క్షోణి తలంబు నన్నుదురు సోకఁగ మ్రొక్కుతూ -

విధేయుడు,

**ఆచార్య తిరుమల.**

హైదరాబాద్ - 95

8-6-2000

## ఓం, ఐం, హ్రీం, శ్రీం, శ్రీ లలితాపరాభట్టారికాయైనమః

చిరంజీవి కృష్ణప్రసాద్ గారు శ్రీలలితానామ సహస్రార్థము అనే ఈ పుస్తకములో అమ్మవారి నామములకు సులభ గ్రాహ్యములైన అర్థములను వ్రాసినారు.

"అర్థము తెలియని చదువు వ్యర్థము" అన్నట్లు ఏ విషయమునైననూ అర్థసహితముగా తెలిసికొనుట సముచితము. కనుక శ్రీ లలిత ఉపాసకులు, భక్తులు శ్రీ లలితా సహస్రనామస్తోత్ర పారాయణమాచరించు పుణ్యమూర్తులందరూ ఈ సహస్రనామ అర్థములను గ్రహించి, తరించవలయును.

చాలా మంది భక్తవరేణ్యులు శ్రీ చక్రోపాసకులు, తాత్పర్య సహిత గూఢార్థ పీఠికలను వ్రాసి భక్తులకు అందించిన విషయము చాలా మందికి విదితమే !

అయిననూ కృష్ణప్రసాద్ గారు ప్రతినామానికీ వ్రాసిన అర్థము, భక్తులైన పసిపాపలనుంచి వృద్ధులవరకు అమ్మవారి తత్త్వము అర్థమగునట్లు సులభ శైలిలో వ్రాసినందులకు నామనః పూర్వక అభినందనలు.

శ్రీ చక్రవాసిని, అష్టకోణ చక్రవాసిని, వేదస్వరూపిణి త్రికోణమూర్తి రాజరాజేశ్వరీ అనుచూ 'అహమిత్యేవ విభావయేభవానీమ్' అనుతత్త్వరహస్యార్థమును ఎరిగి, "హ్రీమ్" సోమ ఖండ మంత్రస్వరూపము సూర్యచంద్రాగ్ని నేత్ర యగుట, ధీరభక్తి అవధారుల సంకేత విశేషములు, ధ్యానావాహనాదిషోడశ ఉపచార పూజలతో "తలపుల సకలాత్మ నిన్ను తలంచి (దాల్చి)," అనునట్లుగా శ్రీ చక్ర వాసిని పాదకమలముల యందు మనస్సును తదేకముగా నిల్పి శ్రీ కృష్ణప్రసాద్ గారు ఈ పుస్తకమును రచించియున్నారు. ఇది భక్తులకు నిజముగా ప్రసాదములాంటిదే.

"కలౌస్మరణౌముక్తిహి" అనునట్లుగా ఇందుపొందు పరచిన నామార్థములను గ్రహించి భక్తులందరూ తరింతురు గాక !

శ్రీ త్రిపురసుందరీ పాదకమలముల యందు దృష్టిని నిల్పి సర్వ విధముల శ్రమకోర్చి పట్టుదలతో తల్లీ! నన్ను ముందుకు నడుపమని దీక్షాయుధమును చేత ధరించి ఈ పుస్తక రచనను పూర్తిచేసి భక్తుల కందించిన సాయి సహిత రాజ్యలక్ష్మి (ముఖ చిత్రకారిణి), కృష్ణప్రసాద్ గార్లకు సర్వదా శ్రీ లలితా కటాక్ష ప్రాప్తి సర్వతోముఖాభివృద్ధి కల్గునట్లు ప్రతిరోజా తల్లిని ప్రార్థిస్తూ -


తల్లి
ఆశీర్వచనములు
కలగ రాధా దుర్గామహాలక్ష్మి,
ఉపాధ్యాయిని (రిటైర్డ్).

త్రిపురాసదన్,
19-43, వివేకానందనగర్,
దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్.

తేది॥ 8-6-2000

మాతృదేవోభవ ! పితృదేవోభవ !

# కృతజ్ఞత

శ్రీ లలితామాత స్వరూపాన్ని, అర్థాన్ని, తత్వాన్ని లాలిత్యంగా దర్శనీయం జేసి 'అర్థగౌరవం'గా నన్ను ఇంకా ముందుకు నడిపిస్తూ చిక్కని పరమాన్నాన్ని ప్రసాదించి ఆశీర్వదిస్తున్న గురువులు 'భారత్ భాషా భూషణ్' డా॥ **ఆచార్య తిరుమల** గారికి - అమ్మవారి పుస్తకరచనకు ప్రధానకారకురాలై వెన్ను తట్టి అన్ని విధాలా ప్రోత్సహించి కన్న తల్లిలా అమ్మవారి దీవెనల దీప్తుల అనుగ్రహింపజేసిన లలితోపాసకురాలు, మాతృదేవతయైన

శ్రీమతి **కలగ రాధా దుర్గా మహాలక్ష్మి** గారి సౌజన్యానికి -

ముఖ చిత్రకారిణి యైన నా శ్రీమతి **రాజ్యలక్ష్మి** కి -

ఆదరించి సహకరించిన ఆత్మీయులందరికీ -

పుస్తకాన్ని ముద్రించి అందించిన **విజయలక్ష్మి ప్రింటర్స్** వారికి -

మరి సహృదయులందరికీ -

అనంతాభివందనములు.

భవదీయ,

**కృష్ణప్రసాద్.**

ఓం శ్రీ లలితాంబాయై నమః

శ్లో॥ యామామనన్తి మునయః ప్రకృతిం పురాణీం
విద్యేతియాం శృతిరహస్య విదోవదన్తి
తామర్థ పల్లవిత శంకరరూపముద్రాం
దేవీ మనన్య శరణః శరణం ప్రపద్యే॥

శ్లో॥ శ్రీ విద్యాం జగతాంధాత్రీం సర్గస్థితి లయేశ్వరీం
నమామి లలితాం నిత్యాం మహాత్రిపుర సుందరీం
పాశాంకుశేక్షు కోదండ ప్రసూన విశిఖాంస్మరేత్
ఉద్యత్కోటి రవి ప్రఖ్యాం మహాత్రిపురసుందరీం॥

జగన్మాతయు,శ్రీ విద్యయు, సృష్టి, స్థితి, లయములకు ఈశ్వరియు, మహాత్రిపుర సుందరియు, నిత్యురాలునైన లలితాదేవికి నమస్కరించుచున్నాను. పాశాంకుశములను, చెఱకు వింటిని, పుష్పబాణములను నాలుగు చేతులందు దాల్చినదియు, ఉదయించుచున్న కోటి సూర్యుల కాంతిగల మహాత్రిపురసుందరిని స్మరింపవలయును.

లలితాదేవి గూర్చి బ్రహ్మాండ పురాణమునందలిఉత్తర ఖండమున చెప్పబడియున్నది. మహాశక్తి స్వరూపిణి. శ్రీమాత, ధర్మార్థ కామమోక్ష ప్రదాయిని, భక్తకోటి ప్రత్యక్ష కల్పలతిక. వేదములు, యజ్ఞములు, స్వర్గము, సకల జగత్తు సర్వమూ దేవియే, శ్రీ చక్రాధిష్ఠాన దేవత.

జన్మ, స్థితి, లయములను కలిగించు బ్రహ్మమే శక్తి. అదియే శ్రీమాత, జగజ్జనని, మహామాయ, మూల ప్రకృతి. పిపీలికాద్రి బ్రహ్మ పర్యంతము వ్యాపించినదియే శక్తి. ఆది శక్తియే సకల జనయిత్రియగు శ్రీమాత. శివశక్తులొక్కటియే. ఉపాధి రహితమ్మైన శుద్ధ చైతన్యము, జ్ఞానము, బిందురూపమైనది కామేశ్వరుడు. ఉపాధితోగూడి సదానందపూర్ణ రూపమైయున్న లలిత అతని కంటె భిన్నమై ఉపాసింప దగినదై ఆకామేశ్వరుని అంకమున అధివసించియుండును. కామేశ్వరీ కామేశ్వరుల సంయోగరూపమే జగన్మాత. త్రిపుర సుందరి శివతత్త్వమునకు అభిన్నురాలు.ఈ శక్తి సర్వ వ్యాపకము, నిత్య ప్రకాశకము. ఇట్టి మాతనారాధించుట మనకర్తవ్యము.

ఇందు లలితా సహస్రనామముల అర్థము గూర్చియు మరియు ఫలశ్రుతియు క్లుప్తంగా వివరించుట జరిగినది. లలితా సహస్రనామము గూర్చి శ్రీ హయగ్రీవుడు అగస్త్య మహర్షికి వివరించినట్లు బ్రహ్మాండ పురాణమందు యున్న ఉత్తరఖండమున చెప్పబడియున్నది. సహస్రనామ పారాయణ మంగళప్రదమైనది. సంస్కృతమున విశిష్టమైన గుణములతో ప్రకాశించుచున్నది. ఇందు శ్రీదేవి యొక్క మూర్తి స్వరూపము, భండాసురుని వధించుట, వివిధ

నివాస స్థానములు, సాధకుని శరీరమందు మూలాధారాది సహస్రారాంత అంతర చక్రములందు శ్రీదేవి స్వీకరించిన స్వరూప స్థానాది విశేషములు, భక్తరక్షణ, దయా వాత్సల్యాది గుణములు, మూర్తామూర్త స్వరూపము, కాపిల, సాంఖ్య, యోగ, వైశేషిక, న్యాయపూర్వ మీమాంసాదార్శనిక పరముగ ఆమె స్వరూప వైభవము, వేదాంతా దార్శనిక దృష్టిలో స్వరూప నిర్ణయము, ఆమె దివ్వ సౌందర్య రూప వర్ణనము మొదలగునవి చెప్పబడియున్నవి.

తల్లిని మించిన దైవం లేదు. శ్రీ చక్రమున శ్రీమాత నర్చించవలెను. అనన్యభావంతో, సత్యనిష్ఠతో, సహస్రనామార్చనతో ఆ దివ్య శక్తిని భావించుచు ఆమెనే గానం చేసిన ఆ పరాశక్తిలో లీనం అగుట తథ్యం.

సదానందపూర్ణా "స్వాత్మైవలలితా"

ఇక నామసహస్రంలోకి ప్రవేశిద్దాం :

1. **శ్రీ మాతా(చతుర్ముఖ)** : బ్రహ్మను సృష్టించి ఆతనికి వేదములనుపదేశించి శ్రీ మాతయైనది. మాతయను శబ్దము మాతృదేవియగు త్రిపుర సుందరిని తెల్పును. సృష్టికి మూలాధార శక్తి. లక్ష్మి, సరస్వతి, రుద్రాణులకు గూడా తల్లియై పరమశివుని పత్నియైన పరాశక్తి పరాభట్టారికయని చెప్పబడినది.

2. **శ్రీ మహారాజ్ఞీ:** సమస్త ప్రపంచ సముదాయమును పాలించు అధికారమును కలిగియున్నది. పంచాక్షరిగాను వెలయుచున్నది.

3. **శ్రీమత్సింహాసనేశ్వరీ:** శ్రీమత్, సింహాసన, ఈశ్వరీ అను మూడు మంత్రములచే సృష్టి, స్థితి, లయముల నొనర్చి హింసను శమింపజేయును. సింహమును ఆసనము చేసుకొని మహిషాసురుని చంపుటచే సింహాసనేశ్వరియని పిలువబడుచున్నది.

4. **చిదగ్నికుండసంభూతా :** చిత్-పరబ్రహ్మ. అదియే అగ్ని కుండము. అది అవిద్యాలక్షణమైన తమోగుణమునకు విరోధి. అవిద్యను తొలగించునది బ్రహ్మ; చిచ్ఛక్తి పరమేశ్వరుని పరిశుద్ధ చైతన్యము. లోక శ్రేయస్సుకై దేవి దివ్యతేజస్సుతో చిద్రూపమైన అగ్నికుండము నుండి పుట్టినది. అందులకే దేవి చిత్స్వరూపిణి. నిర్గుణ పరబ్రహ్మ స్వరూపిణిగా అద్వైతార్థమును తెలియజేయును.

5. **దేవకార్య సముద్యతా :** దేవతా కార్యములను సిద్ధించుటకు పుట్టుచుండును. ఆమె నిత్యురాలు.

6. **ఉద్యద్భాను సహస్రాభా :** వేయి సూర్యులుదయించిన కలుగు అరుణ కాంతితో సమమైన దివ్యతేజస్సుతో బ్రహ్మాండవ్యాప్తమై జ్ఞాన నేత్రాలకు మాత్రమే గోచరించును.

7. **చతుర్బాహు సమన్వితా:** నాలుగు హస్తములందు నాలుగు వేదములను ధరించి నాలుగు ఆయుధములచే అసురులను అంతమొందించును.

8. **రాగస్వరూప పాశాఢ్యా :** ప్రేమ స్వరూపమైన పాశముతో భక్తులను బ్రోచును.

9. **క్రోధాకారాఙ్కుశోజ్జ్వలా :** దుష్టులనణచుటకు క్రోధాకారమైన అంకుశమై ప్రకాశించును. భక్తులకు అంకుశము జ్ఞానరూపముగను, సత్త్వరూపమైన పరతత్త్వమే లలితా దేవియని స్ఫురించును.

10. **మనోరూపేక్షుకోదండా :** మనోరూపమైన చెఱకు విల్లును ఎడమ చేతియందు ధరించి సంకల్ప వికల్పాత్మకమై, అస్థిరమై, చంచలమైన మనస్సును ఏకాగ్రమొనర్చుటకు మెత్తగా కూల్చును. అపుడు సమాధి కుదిరి ఆనందరూపమైన బ్రహ్మసాక్షాత్కారమగును. ఆమె హృదయమెంత మృదు మధురము !

11. **పంచతన్మాత్రసాయకా :** పంచతన్మాత్రలైన శబ్ద, స్పర్శ, రస, రూప, గంధములను బాణములుగా ఉపయోగించి పంచభూతసృష్టికర్త్రియై వానిని మించి ప్రకాశించును.

12. **నిజారుణ ప్రభాపూర మజ్జద్బ్రహ్మాండమండలా :** తన దివ్యమైన అరుణకాంతిచే సకల బ్రహ్మాండములను క్రాంశింపజేయును.

13. **చంపకాశోక పున్నాగ సౌగన్ధి కల సత్కచా :** దేవి కేశపాశములు సహజగంధము కలిగి చంపకాది పుష్పములకావాసననిచ్చి ఆ పుష్పములను ధరించుటచే వాటికి శోభ కలుగును.

14. **కురువిందమణి శ్రేణీకనత్కోటీరమండితా :** కురువింద మణులు అనగా కామము, అనురాగము మొదలగు గుణములతో కూడిన పద్మరాగమణులతో ప్రకాశించు కిరీటముచే మెరియుచు భక్తుల భక్తి ప్రవత్తులను వృద్ధిచేయును.

15. **అష్టమీ చంద్ర విభ్రాజదళికస్థల శోభితా :** ఆమె అర్ధచంద్రాకారమైన నొసటి ప్రదేశము అష్టమి నాటి సమచంద్రార్థుని పోలి ప్రకాశించును.

16. **ముఖ చంద్రకలం కాభ మృగనాభి విశేషకా :** చంద్రునిలోని మచ్చవలె చంద్రుని వంటి ఆమె సుందర ముఖమునందు కస్తూరిబొట్టు విశేషమై ప్రకాశించును.

17. **వదనస్మరమాంగల్య గృహతోరణ చిల్లికా :** వదనము మన్మథుని గృహముతో సాటియై కనుబొమలు గృహతోరణము వలె ప్రకాశించును.

18. **వక్త్రలక్ష్మీ పరివాహచల న్మీనాభలోచనా :** మీనాక్షిగా ప్రసిద్ధి వహించి తనకటాక్ష మాత్రము చేతనే భక్తులను పోషించును.

19. **నవ చంపక పుష్పాభ నాసాదండ విరాజితా :** ఆమె నాసికము అపుడే వికసించిన సంపెంగ పూవు వలె ప్రకాశించును.

20. **తారాకాంతి తిరస్కారి నాసాభరణ భూషితా :** నాసాభరణమైన బులాకి రత్నములు, ముత్తెములతో అలంకరింపబడి తారాకాంతిని అనగా కుజ, శుక్ర నక్షత్రముల

కాంతిని మించి ప్రకాశించును.

21. **కదంబ మంజరీక్లుప్తకర్ణపూర మనోహరా :** చెవిపై భాగమున కదంబ పుష్పగుచ్ఛమును ధరించి దేవిమనోహరురాలై యొప్పును.

22. **తాటంక యుగళీభూతతపనోడుప మండలా :** సూర్యచంద్రులను కమ్మలుగా ధరించిన మహిమ పరాశక్తికి మాత్రమే గలదు.

23. **పద్మరాగ శిలాదర్శ పరిభావి కపోలభూః:** దేవికపోలములు ఎఱ్ఱనై పద్మరాగశిలలను అద్దమును మించి నునుపు కలిగి ఎదుటనున్న పరమశివుని గ్రహించును. అనగా శివుడీమె చెక్కుటద్దములలో ప్రతిఫలించును.

24. **నవవిద్రుమ బింబ శ్రీన్యక్కారి రదనచ్ఛదా :** ఆమె పెదవులు నూతనమైన పరిపక్వ పగడము, దొండపండుల కాంతిని మించి అధికమైన, ఔన్నత్యమైన కాంతి కలిగి యుండును.

25. **శుద్ధ విద్యాంకురా కార ద్విజ పంక్తిద్వయోజ్జ్వలా :** భేదమెరుగని అభేదమైన శుద్ధ విద్యకు మొలకలవంటి ఆకారము గల (ద్విజపంక్తి) దంతముల వరుస యొక్క జంటచే ప్రకాశించును.

26. **కర్పూర వీటికామోద సమాకర్షద్దిగంతరా :** ఏలకులు, లవంగములు, పచ్చకర్పూరము, కస్తూరి, నాగకేసరములు, జాజికాయ, వక్కలు మొదలగువాని పొడి తమలపాకులతో గూడినది కర్పూరవీటిక, అట్టి తాంబూలము సేవించిన దేవీ ముఖపరిమళము దిగంతములు నిండియుండును. దిగ్దేవతలా పరిమళమున కాసపడి అదృశ్యరూపులై వేచియుందురు.

27. **నిజసల్లాప మాధుర్య వినిర్భర్త్సితకచ్ఛపీ:** దేవి పలుకులయందలి మాధుర్యము, స్పష్టత, రమ్యత సరస్వతీ దేవి కచ్ఛపి వీణాతంత్రీ నినాదమును మించియుండును.

28. **మందస్మిత ప్రభాపూర మజ్జత్ కామేశ మానసా:** దేవి చిరునవ్వు కాంతి ప్రవాహము ఎల్లలు లేనిదై అగ్నిసోమాత్మక రూపమైన, కామకల కీశ్వరుడైన కామేశ్వరుని మనస్సును గూడా ఆకర్షించును.

29. **అనాకలిత సాదృశ్య చుబుక శ్రీవిరాజితా:** ఆమె అనుపమానమైన చుబుక కాంతి శోభతో ప్రకాశించును.

30. **కామేశ బద్ధమాంగల్య సూత్ర శోభిత కంధరా:** మన్మథుని బ్రతికించుటకు కారణమై పరమ శివునిచే ధారణము చేయబడిన మంగళ సూత్రము ఆమెమెడయందు మిక్కిలి ప్రకాశించును.

31. **కనకాంగద కేయూర కమనీయ భుజాన్వితా:** బంగారపు అంగద (శరీరఘటకము), కేయూరములచే మనోహరమైన భుజములు కలిగి దేవి మరింతగా ప్రకాశించును.

32. రత్నగ్రైవేయ చింతాకలోల ముక్తా ఫలాన్వితా : దేవి రత్నములు, బంగారము, ముత్యములతో చేయబడిన కంఠాభరణమును దాల్చి లౌకిక దృష్టిని వీడి పారమార్థిక దృష్టితో ముక్తికై ధ్యానించుట ఉత్తమమను స్ఫురణ నిచ్చును.

33. **కామేశ్వర ప్రేమరత్నమణి ప్రతిపణస్తనీ :** దేవి పరమశివుని యందు ప్రేమాతిశయముతో సతీరత్నమై యొప్పచు ఆమె కరుణకై భక్తి, జ్ఞానములచే స్మరింపవలెనని తెలియజేయును.

34. **నాభ్యాలవాల రోమాళిలతా ఫలకుచద్వయీ :** సృష్టిలోని సకల జీవరాసులనుద్ధరించుటకు అమృత క్షీరములను దాల్చినదియన్న భావనతో ధ్యానింప వలెనన్న జ్ఞానమునిచ్చును.

35. **లక్ష్యరోమలతా ధారతా సమున్నేయ మధ్యమా:** దేవి రోమలతలా సూక్ష్మమైన నడుము కలిగి మాయాతీతమై లక్ష్యముతో తెలియదగియున్నది.

36. **స్తనభారదళన్మధ్య పట్టబంధ వళిత్రయా :** సన్నని నడుమునకు బంగారు పట్టిక ముమ్మారు చుట్టబడియుండుటచే కలిగిన మూడు మడతలచే ఒప్పచు కాలస్వరూపిణియై త్రికాలములందు అవిచ్ఛిన్నముగా ప్రకాశించును.

37. **అరుణారుణ కౌసుంభ వస్త్ర భాస్వత్కటీతటీ:** మిక్కిలి ఎఱ్ఱనైన వస్త్రముచే కటి భాగము ప్రకాశించుచు సర్వవ్యాప్తియై కోటి సూర్యుల కాంతితో సమముగా ప్రకాశించును.

38. **రత్న కింకిణికా రమ్యరశనాదామ భూషితా :** రత్నమయ చిరుగంటలతో, రమ్యమైన బంగారు మొలనూలుతో అలంకరింపడి నాదమయ ఓంకారాత్మక సూత్రధారిణిగా ఒప్పను.

39. **కామేశ జ్ఞాతసౌభాగ్య మార్దవోరు ద్వయాన్వితా :** ఊరువుల కాంత్యతిశయము, మృదుత్వము పరమశివునకే ఎరుకయనుటలో ఆమె సతీత్వము, శివశక్త్యైక్యము నిరూపితమగును.

40. **మాణిక్యమకుటాకార జానుద్వయ విరాజితా:** మోకాళ్లు మాణిక్యమకుటాకారమును బోలి దివ్యమైన కాంతులతో విరాజిల్లును.

41. **ఇంద్రగోప పరిక్షిప్త స్మరతూణా భజంఘికా :** స్మరణమాత్రము చేతనే మోక్షమిచ్చి రక్షించును.

42. **గూఢగుల్ఫా:** బలిష్ఠమైన చీలమండలు కలిగి ధ్యానించు వారిని రక్షించును.

43. **కూర్మపృష్ఠ జయిష్ణు ప్రపదాన్వితా:** తాబేలు వీపువలె జయించు స్వభావము కలిగి సమస్తలోక రక్షణతో ప్రకాశించును.

44. **నఖదీధితి సంఛన్న నమజ్జన తమోగుణా :** త్రిపురసుందరీ నఖకాంతులు-అమెను మ్రొక్కువారి అజ్ఞానమును తొలగించి జ్ఞానమునొసగును.

45. **పదద్వయ ప్రభాజాల పరాకృత సరోరుహా :** అమె పదద్వయము కమ్మలముల కాంతిని మించి ప్రకాశించుచు మారవ సౌకుమార్యాది గుణములు కలిగి

పద్మాలయాయని కీర్తింపబడుచున్నది. లక్ష్మీ, సరస్వతులకు తల్లియై పరాభట్టారికయని పిలువ బడుచున్నది.

46. **శింజాన మణిమంజీర మండిత శ్రీపదాంబుజా :** ఆమె పాద పద్మములకు అలంకరింపబడిన మణిమయములైన కాలియందేల ధ్వని వేద ధ్వనిని స్ఫురించును.

47. **మరాళీ మందగమనా :** ఆడ హంసవలె మెల్లని నడక కలిగి సర్వ వ్యాపినియై పరమాత్మ స్వరూపమును తెలుపును.

48. **మహాలావణ్య శేవధి :** ప్రకృతిలోని అందమైన వస్తువులను సృష్టించు సౌందర్య నిధి.

49. **సర్వారుణా :** త్రిపురసుందరి కుసుంభ వస్త్రము, రక్తచందనము, మాణిక్యాభరణములు, మందార కుసుమము స్వర్ణమూ అరుణారుణ ప్రభలతో వెలుగుచున్న అరుణ తేజస్సే పరాశక్తి.

50. **అనవద్యాంగీ :** ఆమెచే సృష్టింపబడినవన్నియూ దోషరహితమైనవి, సుందరమైనవి.

51. **సర్వాభరణ భూషితా :** శిరోభూషణము మొదలు మెట్టెల వరకు సర్వాభరణములను అలంకరించుకొని సర్వజగత్తును భరించును.

52. **శివకామేశ్వరాంకస్థా :** మంగళకరుడైన కామేశ్వరుని తొడపైన అధిష్ఠించి యుండి శివకామేశ్వర స్వరూపమైన ప్రజ్ఞానము యొక్కఒడిలో ఉండునట్లు తెలుపును. అనగా ఆమె జ్ఞాననిష్ఠితురాలు.

3. **శివా :** శివుడు, దేవి కలిసిన రూపము ప్రకాశ విమర్శాత్మకము. జ్ఞానాత్మకము, మాయాతీతము అయిన చిద్రూపమే శివాస్వరూపము.

4. **స్వాధీన వల్లభా :** భర్తను స్వాధీనము చేసుకొన్నది. అనగా శివుడు శక్తికి అధీనుడగుటచే త్రిపురా సుందరి మూలశక్తియై అలరారుచుండును.

55. **సుమేరు మధ్య శృంగస్థా :** శోభనమైన మేరు పర్వత శృంగ మధ్యమందు సమస్త లోకముల కతీతమైన స్థానము తన నిలయముగా చేసుకొని ప్రకాశించును.

56. **శ్రీమన్నగరనాయికా :** శ్రీ విద్యానగరమునకు నాయిక.

57. **చిన్తామణి గృహాంతస్థా :** చింతామణుల గృహ మధ్యమందు నివసించుచు చింతామణి మంత్రరాజమునకు అధిష్ఠానయై యున్నది.

58. **పంచబ్రహ్మాసనస్థితా :** పంచబ్రహ్మలు, పంచభూతములపై యుండి పంచబ్రహ్మ మంత్రముల నధిష్ఠించి చిత్కలా రూపమై ప్రకాశించును.

59. **మహాపద్మాటవీసంస్థా :** బ్రహ్మరంధ్రమున గల సహస్రదళ పద్మమైన పద్మాటవి యందు నివాసము చేసుకొని యుండును.

60. **కదంబ వనవాసినీ :** కడిమి వృక్షముల అడవియందు చీకటి వెలుగులకతీతమైన చోట నివసించును.

61. **సుధాసాగరమధ్యస్థా :** సుధాసాగర మధ్యమున నుండి జీవులకు అమృతత్వమునిచ్చును.

62. **కామాక్షీ :** కంచిపీఠాధి దేవత. శివస్వరూపమైన దేవిగా భక్తుల కోర్కెలు తీర్చును.

63. **కామదాయినీ :** ఇహపరసౌఖ్యములనొసగును.

64. **దేవర్షి గణసంఘాతస్తూయ మానాత్మవైభవా :** సంఘాత మనునరకము తొలగుటకు సకల దేవర్షి గణము దేవి పరతత్త్వ మహిమను పొగడుదురు. దానిచే కలిగిన ఆత్మవైభవమును కలిగియుండును.

65. **భండాసుర వధోద్యుక్త శక్తి సేనా సమన్వితా :** భండాసురుని చంపుటకు అనేక రూపములు దాల్చి శక్తి సేనకై పోరెను. అనగా అజ్ఞాన జీవ బంధ వినాశమునకై చేయు ప్రయత్నముల సామర్థ్యముల సమూహములతో గూడియుండును.

66. **సంపత్కరీ సమారూఢ సింధుర వ్రజసేవితా :** దేవి యొక్క అంకుశమనెడి అస్త్రము నుండి పుట్టిన గజాధిపతి సంపత్కరీ దేవిచే బాగుగా గజశాస్త్రమందు చెప్పబడిన ఉపాయములతో గజముపై అధిరోహింపబడి, అదుపులో పెట్టబడిన భద్ర[illegible]మంద, మృగాదిభేదములచే నొప్ప ఏనుగులగుంపుచే సేవింపబడును. సంపత్కరీ దేవియే లలితాపరమేశ్వరి.

67. **అశ్వారూఢాధిష్ఠితాశ్వకోటి కోటిభిరావృతా :** పాశాయుధము నుండి పుట్టిన అశ్వములకధి దేవత అశ్వారూఢ మిక్కిలి వేగము కలిగి కోటి కోట్ల అశ్వములను వశపరచుకొని వాటితో ఆవృతమైయుండును. దేవిని పూజించువారు ఇంద్రియాశ్వములను నడుపు మనసును అరికట్టి అంతర్ముఖులై ఆత్మ జ్ఞాన నిష్ఠతో పరమాత్మ స్వరూపులగుదురు.

68. **చక్రరాజ రథారూఢ సర్వాయుధ పరిష్కృతా :** శ్రీ చక్రరథమును పొందిన దేవి అలంకరించుకొన్న ఆయుధములన్నియు అనగా ఆత్మజ్ఞానలబ్ధికి వలసిన సాధనములన్నియు లభించి ఆత్మ జ్ఞానము కలిగి సర్వము ఆత్మ జ్ఞాన స్వరూపమనియు, అహంబ్రహ్మాస్మి యనుజ్ఞానమునిచ్చును.

69. **గేయ చక్రరథారూఢ మంత్రిణీ పరిసేవితా :** శ్రీ చక్రమందలి బిందువునాక్రమించిన త్రికోణమే గేయ చక్రము. బుద్ధి తత్త్వ పరివర్తనమే మంత్రిణి. ఆమెయే త్రిపురాశక్తి. గేయచక్రమను రథమునెక్కిన శ్యామలాదేవిచే సేవింపబడును. ఆత్మ జ్ఞానాను భవముచే నేనే ఆ దేవియను అనుసంధానము చేసిన అభేద విద్యాస్ఫూర్తి, మంత్రరహస్యానుభవము కలిగి పరబ్రహ్మ సాక్షాత్కారము సిద్ధించును.

70. **కిరి చక్రరథారూఢ దండనాథా పురస్కృతా :** వరాహముచే లాగబడు చక్రములు గల రథమును అధిష్ఠించి దండము హస్తమందుగల వారాహి దేవిచే సేవింపబడును.

71. **జ్వాలా మాలిని కాక్షిప్త వహ్ని ప్రాకారమధ్యగా :** చతుర్థశీ తిథికి దేవియైన నిత్యా దేవియే జ్వాలామాలిని. ఆ దేవిచే శ్రీమాత చుట్టూ నిర్మింపబడిన అగ్నిమయ ప్రాకార మధ్య భాగమున లలితాదేవి నివసించును. జ్ఞానదృష్టి గల వానికి అజ్ఞానాంధకారమును నాశము జేయు జ్ఞానాగ్ని జ్వాలల మధ్య నుండినను దేవీతత్త్వము నెరిగిన వాడగుటచే ఏమియూ చేయజాలవు.

72 **భండసైన్య వధోద్యుక్త శక్తి విక్రమ హర్షితా :** భండాసురుని చతురంగ సైన్యమును చంపుటయందు సఫలీకృత ప్రయత్నము చేసిన నకులి మొదలగు శక్తుల పరాక్రమమునకు సంతసించును. భండశబ్దమునకు జీవభావమని గ్రహించిన ద్వైతవృత్తులను నశింపజేయు అద్వైతశక్తి విక్రమమును గాంచి దేవి సంతసించును.అట్టి ప్రయత్నము చేసిన జీవి జ్ఞానియై ముక్తుడగును.

73. **నిత్యపరాక్రమాటోపనిరీక్షణ సముత్సుకా :** కామేశ్వరి మొదలు చిత్రాంతలైన పదిహేను తిథుల దేవతలు నిత్యాఖ్య దేవతలు. వారి పరాక్రమ విస్తారమును గమనించుట యందు మిక్కిలి ఆసక్తి కలిగి యుండును. నిత్యాయన ఆత్మ శక్తులు. హృదయమున పొడసూపిన అట్టి ఆత్మ శక్తి వృద్ధి చెందుట యందాసక్తుడు కావలయునని దేవి కోరును.

74. **భండపుత్రవధోద్యుక్త బాలావిక్రమనందితా :** చతుర్బాహుడు మొదలు ఉపమాయువు వరకు గల ముప్పది మంది భండాసురుని పుత్రులను చంపుటకు పూనిన తన హృదయమునుండి పుట్టిన బాలయను పుత్రిక యొక్క పరాక్రమమును గాంచి సంతసించును.

75. **మంత్రిణ్యంబా విరచిత విషంగ వధతోషితా :** మంత్రిణ్యంబ=శ్యామలాదేవి. ఆమె భండాసురుని సోదరుడైన విషంగుడను రక్కసుని వధించుటచే సంతసించును.

76. **విశుక్రప్రాణ హరణ వారాహీ వీర్యనందితా :** విశుక్రుడను రాక్షసుని సంహరించిన వారాహి దేవి పరాక్రమమును విని సంతసించును.

77. **కామేశ్వర ముఖాలోక కల్పిత శ్రీగణేశ్వరా :** శివుని ముఖ చంద్రుని యొక్క ప్రేమతో గూడిన చూపులనెడి వెన్నెలలచే కల్పింపబడిన మహా గణేశ్వరుడుగలది.

78. **మహాగణేశ నిర్భిన్న విఘ్నయంత్ర ప్రహర్షితా :** మహాగణపతి అసురులు చేయు విఘ్నయంత్రములను నాశనము చేయుటను దేవిగాంచి సంతసించును.

79. **భండా సురేంద్ర నిర్ముక్త శస్త్ర ప్రత్యస్త్ర వర్షిణీ :** భండాసురుడను దైత్యరాజు ఉపయోగించు శస్త్రములకు ప్రత్యస్త్రములను వర్షించును. ఇట అవిద్యయను అస్త్రమును ఆత్మజ్ఞానమను ప్రత్యస్త్రముచే నశింపజేయ వలయునని భావము.

80. **కరాంగుళిన ఖోత్పన్ననారాయణ దశాకృతిః :** కుడి ఎడమ చేతుల పదివ్రేళ్ల యొక్క గోళ్ల సందుల నుండి పుట్టిన నారాయణుని దశావతారములు కలిగి యుండును. నారాయణ శబ్దము జీవేశ్వరులను, దశా శబ్దము అవస్థలను, కృతి శబ్దము కృత్యపరముగా చెప్పవచ్చును. అనగా దేవిచే సృష్టింపబడిన మాయాకృత్యములను ఆత్మ జ్ఞానముచే ఎరిగి మాయామోహప్రపంచములో చిక్కుబడక ఆనందాను భూతిని పొందవలెను.

81. **మహా పాశుపతాస్త్రాగ్ని నిర్దగ్ధా సురసైనికా :** మహా పాశుపతమునకు దేవతయైన సదాశివుని అస్త్రాగ్నిచే భండాసుర సైనికులను దగ్ధము చేసినది.

82. **కామేశ్వరాస్త్ర నిర్దగ్ధస భండాసుర శూన్యకా :** మహాపాశుపతాస్త్రము కంటె శక్తివంతమైన కామేశ్వర శస్త్రాగ్నిచే భండాసురుని శూన్యకమను పట్టణమును దహింపజేయును.

83. **బ్రహ్మోపేంద్రమహేంద్రాది దేవ సంస్తుతవైభవా :** భండాసురుని చంపుటచే బ్రహ్మ, విష్ణు, ఇంద్రాది దేవతలచే మరల మరల లెస్సగా స్తుతింపబడిన పరాక్రమమును కలిగియుండును.

84. **హరనేత్రాగ్ని సందగ్ధ కామ సంజీవనౌషధిః :** శివుని మూడవకంటిచే దగ్ధము చేయబడిన మన్మథుని బ్రతికించుటకు ఔషధము వంటిది అనగా అజ్ఞానని వృత్తికి ఔషధివంటిది.

85. **శ్రీమద్వాగ్భవ కూటైక స్వరూప ముఖ పంకజా :** శ్రీమత్ యనః జ్ఞానము నొసగు మహిమతోగూడినది. దీని నుండి వాక్కలుగున గాన వాగ్భవకూటమగును. పంచదశీ విద్యలోని మొదటి అయిదు అక్షరములు క,ఏ,ఈ,ల,హ్రీం పంచాక్షరములు వాగ్భవకూటము. ఇవి దేవి సూక్ష్మ రూపము అనగా మంత్రరూపమును తెలుపును.ఈ పంచాక్షరముల సముదాయమే ముఖ్యమైన తన రూపమై పంకజ ముఖమును కలిగియుండును.

86. **కంఠాధః** కటిపర్యంత మధ్యకూట స్వరూపిణీ ; కంఠము క్రింద నడుము వరకుగల మధ్యభాగము పంచదశిలోని హ,స,క,హ,ల,హ్రీం అను ఆరు అక్షరముల సముదాయము మధ్య కూటముగా తన నిజస్వరూపముగా కలిగియుండును.

87. **శక్తి కూటైక తాపన్న కట్యధోభాగధారిణీ :** సత్పురుషుల శక్తిగల శక్తి కూటముచే పంచదశిలోని చివరి నాలుగు అక్షరములు స,క,ల,హ్రీం సముదాయముతో అభేదమును పొందిన కటికి క్రింది భాగమును ధరించును. శక్తి కూటము గూడా మంత్రాత్మకమైన దేవికి ముఖ్యభాగము.

88. **మూల మంత్రాత్మికా :** పంచదశాక్షరి మంత్రము మూల మంత్రమై ఆత్మస్వరూపముగా కలిగి యుండును. సంసారక్షయ మొనర్చి ఆత్మ సాక్షాత్కారమును కలిగించునది మంత్రము. అట్టి పంచదశీ మంత్ర స్వరూపిణి లలితా దేవి.

89. **మూల కూటత్రయ కళేబరా :** మూల మంత్రము యొక్క కూట త్రయమే స్థూల రూపముగా కలిగియుండును.

90. **కుళామృతైక రసికా :** కుళామృతమనగా శరీరముగాని శరీర సంబంధముగాని యగును. పుష్పించిన కుళాకారమునందలి అమృతమను రహస్యమును నిరసించును. శరీరమునందలి అమృతత్వమును తెలుసుకొని దేవినుపాసించవలెను.

91. **కుల సంకేతపాలినీ :** లలితాదేవి పాతివ్రత్యాది గుణశీల యనియు, సర్వాంతర్యామియనియు ఎరుగవలయును.

92. **కులాంగనా :** కులమనగా పాతివ్రత్యాది గుణశీలమైన వంశము. అట్టి గుణములు గల కులస్త్రీ రహస్యముగా రక్షింపబడునట్లు శాంభవీ విద్యగుప్తయగుచున్న, అట్టి విద్యను దేవి నారాధించి పొందవలయును.

93. **కులాంతస్థా :** కులశాస్త్రముల మధ్యలో తెలియదగినది, ధ్యానింపదగినది.

94. **కౌళినీ :** కుళమనగా శక్తి. అ కుళమనగా శివుడు. అట్టి కుళాకుళ సంబంధమే అనగా శివశక్తి సామరస్యమే కౌళమని చెప్పబడును. అట్టి కౌళము గలది కౌళిని. అందరిచే అంతటా పూజింపబడును.

95. **కుళయోగినీ :** బాహ్యాపరమైన ఆరాధనయైన కౌళముతో సంబంధము గలది యగుటచే కుళయోగినియని పిలువబడును.

96. **అకుళా :** సహస్రార పద్మరూపముగలది యగుట చేతను. దేహవంశాదికమైన కులము లేకపోవుట చేతను అకుళయని పిలువబడును.

97. **సమయాంతస్థా :** హృదయాకాశమందు చక్రమును ఊహించి పూజాదులనొనర్చుట సమయమని చెప్పబడును. అట్టి సమయమును ప్రతిపాదించు వశిష్ఠ, శుక, సనక, సనందన, సనత్కుమార సంహితలలో ఉండి సమయ మార్గములో లలితామాతను పూజింపవలయును.

98. **సమయాచారతత్పరా :** వైదిక సమయాచారములతో పూజించు పద్ధతియందు అనగా యోగమార్గమందు మిక్కిలి ఆసక్తి కలిగి యుండును.

99. **మూలాధారైక నిలయా :** మూలధారమను నాలుగు రేకుల పద్మము ముఖ్యమైన నివాసముగా కలిగి యుండును.

100. **బ్రహ్మగ్రంథివిభేదినీ :** బుద్ధినావరించియున్నమాయను భేదించి స్వస్వరూప జ్ఞానమును అనగా ముక్తిని ప్రసాదించును.

101. **మణిపూరాంతరుదితా :** దేవి ప్రత్యక్షము కొరకు సమయాచారతత్పరులు దేవిని మణిపూర చక్రమందు భావించి పూజింతురు.

102. **విష్ణుగ్రంధి విభేదినీ :** మణిపూర చక్రమునకు పైనగల విష్ణుగ్రంథిని విశేషించి భేదించును. అనగా దేవి సృష్ట్యాది రూపబ్రహ్మగ్రంథిని భేదించి పిదప

జీవభావరూప విష్ణుగ్రంథిని భేదించి సాధకునకు స్థూలమువలె సూక్ష్మము అనిత్యమును జ్ఞానమునొసగును.

103. ఆజ్ఞాచక్రాంతరాళస్థా: కనుబొమల ముడిమధ్యరెండుదళములుగల పద్మము నందు ఆజ్ఞాపరుడైన శ్రీగురువుగల స్థానము ఆజ్ఞాచక్రము. అందు మధ్యలోనుండు దేవిని ఆరాధించికించిత్‌జ్ఞానమును పొందిన పిదప పరిపూర్ణ జ్ఞానము కొరకు సహస్రారమందుగల దేవిని ధ్యానింపవలయును.

104. రుద్రగ్రంథి భేదినీ: బ్రహ్మగ్రంథిచే సృష్టిని, విష్ణుగ్రంథిచే జీవదశను, రుద్రగ్రంథిచే లయాదులు అన్నిటిని భేదించి వీటికతీతమైన చిదానంద స్థితిని కలిగించును.

105. సహస్రారాంబుజారూఢా: బ్రహ్మ రంధ్రమునకు క్రిందగల వేయిదళములుగల పద్మము దేవికి స్థానమై సాధకునకు అచట సహస్రారకమల స్థితగా ప్రత్యక్షమగును.

106. సుధాసారాభివర్షిణీ: సహస్రారకమల మధ్యస్థయై తనను కొలుచు వారికి తన పాదకమలము నుండి అమృతధారలు వర్షించి అమృతత్వము నొసగును.

107. తటిల్లతా సమరుచిః: మెరుపు తీగతో సమానమైన కాంతిగలదై అజ్ఞానమును, మాయను తొలగించి జ్ఞానకాంతినిచ్చు దివ్యజ్యోతి.

108.షట్చక్రోపరి సంస్థితా: షట్చక్రములైన 1. మూలాధార 2. స్వాధిష్ఠాన 3. మణిపూర 4. అనాహత 5. విశుద్ధ 6. ఆజ్ఞాయను ఈ ఆరుచక్రములపై నుండు సహస్రారకమలమందు సుస్థితురాలై యుండును.

109. మహాసక్తిః: ఆత్మ జ్ఞానైక రూపమైన ఆనందమునందాసక్తి కలిగియుండును.

110. కుండలినీ: పంచదశాక్షరిలో వాగ్భవకూటము కుండలినియై వాగ్భవ బీజరూపమైనది.

111. బిసతంతు తనీయసీ: అణుస్వరూపమై పీతవర్ణము కలిగి తామరతూడులోని దారముతో సాటియై, సూక్ష్మమై శుభకరమై యొప్పను.

112. భవానీ: భవము - జీవరూపమైన నీరు. అట్టి దానిని బ్రతికింపజేయునది భవాని.

113. భావనాగమ్యా: పూజాదులచే గాక కేవలము మనస్సును నిష్క్రియమొనర్చి ధ్యానముచే సమాధిలో పొందదగియుండును.

114. భవారణ్యకుఠారికా: దుఃఖముతో గూడి చొరరాని సంసారారణ్యమునకు గొడ్డలి వంటిది.

115. భద్రప్రియా: భద్రజాతి గజములపై ఆసక్తి కలిగియుండును, మరియు భద్రమన మంగళము, మంగళము ప్రియముగా కలిగి యుండును.

116. భద్రమూర్తిః: మంగళకరమైన శరీరము కలది.

117. భక్తసౌభాగ్యదాయినీ: భక్తులకు సౌభాగ్యములనొసగును.

118. భక్తిప్రియా : భక్తిప్రియముగా కలిగి భక్తులు బహిర్గతముగా గాని అంతర్గతముగా గాని చేయు సేవలను గ్రహించును.

119. భక్తిగమ్యా: సకలశాస్త్రాదులు భక్తిని గూడ ముక్తికి హేతువని వర్ణించుటచే పరాశక్తిని పొందుటకు భక్తియే సాధనము.

120. భక్తివశ్యా: భక్తికి వశ్యురాలు.

121. భయాపహా: దేవి నిస్మరించు వారికెట్టి భయములుండవు.

122. శాంభవీ: శంభువు భార్య, భక్తులకు తల్లి శాంభవి.

123. శారదారాధ్యా: విశారదులు, పండితులైన శారదులచే శారదా దేవిగా పూజింపబడును. శరదృతువులో నవమినాడు, వర్షర్తువులో, వసంతఋతు నవరాత్రములందును పూజింపదగును.

124. శర్వాణీ: అష్టమూర్తులలో భూరూపమూర్తి గల శివుని శర్వుడందురు. ఆ శర్వశబ్దమును స్త్రీత్వార్థమున శర్వాణి అందురు.

125. శర్మదాయినీ : శర్మయన సుఖము. భక్తులకు సుఖము నొసగుటచే శర్మదాయిని.

126. శాంకరీ: సుఖమునిచ్చు శంకరుడే శాంకరుడు. అతని భార్య శాంకరీ.

127. శ్రీకరీ: లక్ష్ములను కలిగించునది శ్రీకరి.

128. సాధ్వీ: అనన్య సామాన్యమైన పాతివ్రత్యముగలది.

129. శరచ్చంద్రనిభాననా : భక్తుల కామె మోము శరచ్చంద్రునివలె ఆహ్లాదమును కలిగించును.

130. శాతోదరీ : సూక్ష్మమైన, సన్నని ఉదరము గలది మరియు శతోదరుడను హిమవంతుని పుత్రిక హైమవతి.

131. శాంతిమతీ: శాంతి, అంతరింద్రియ నిగ్రహము గలది.

132. నిరాధార : సకలజగత్తులకు ఆమెయే ఆధారమగుటచే ఆమెకు వేరొక ఆధారమవసరము లేక నిరాధారమను పూజా స్వరూపమును కలిగియున్నది.

133. నిరంజనా: అంజనము అనగా అజ్ఞానమను నలుపు. అట్టి అజ్ఞానము నశించినది నిరంజనము. మాయోపాధిరహితురాలు, అవిద్యలేనిది, జ్ఞానస్వరూపిణి, చిత్స్వరూపిణి.

34. నిర్లేపా: దేవి మాయకు, కర్మాదులకు దూరురాలై జ్ఞాన రూపిణియగుటచే ఆమెను ధ్యానించువారు కర్మాదులచే అంటబడక జ్ఞానులై ముక్తులగుదురు.

35. నిర్మలా: మాయామలాదులచే అంటనిదై స్వచ్ఛముగా ప్రకాశించును.

. **నిత్యా:** సృష్ట్యాదులచే బాధితురాలు గాక సర్వకాల సర్వా వస్థలయందు నిత్యముగా నుండును.

137. **నిరాకారా:** దేవిని నిర్గుణ పరబ్రహ్మగా భావించి ఆరాధింపవలెను.

138. **నిరాకులా:** శూన్యవాదమును త్రోసి పుచ్చి చలి తాత్ములకు దూరముగా నుండి నిశ్చల హృదయములలో నివసించును.

139. **నిర్గుణా:** లక్షణములకు, గుణములకు మించి నిర్గుణగా ప్రకాశించును.

140. **నిష్కలా:** అవయవములు, గుణములు లేక నిష్కలయై సగుణ ధ్యానముగాక నిర్గుణ పరబ్రహ్మ చింతనయే ధ్యానమని తెలియజేయును.

141. **శాంతా:** శమము కలిగి అమృత బీజాత్మకమై సర్వవ్యాప్తమై యుండును.

142. **నిష్కామా:** నిష్కామమైన మతిగలది.

143. **నిరుపప్లవా:** దేవి అమృతమయురాలై తన్నుసేవించువారిని అమృత మయులుగా చేయును.

144. **నిత్యముక్తా:** నిత్యముక్తురాలు, మోక్షస్వరూపిణి.

145. **నిర్వికారా:** మహదాది తత్త్వాతీతమై వికారరహితమై ప్రకాశించును.

146. **నిష్ప్రపంచా:** బ్రహ్మాండములకు మించియుండును.

147. **నిరాశ్రయా:** సర్వమునకు తానే ఆశ్రయమగుటచే ఆమెకు వేరు ఆశ్రయముతో అవసరము లేనిది.

148. **నిత్యశుద్ధా:** అమలిన, నిర్మల, నిత్యశుద్ధ, మాయాది రహితయైనది.

149. **నిత్యబుద్ధా:** జ్ఞానస్వరూపిణి, చిద్రూపిణి యగుటచే నిత్యబుద్ధయగుచున్నది.

150. **నిరవద్యా:** దేవి అనింద్య, దోషరహితమైనది. భక్తులు అవద్య నరకములో పడరు.

151. **నిరంతరా:** భేదములు, హద్దులు, ఛిద్రములు లేనిది.

152. **నిష్కారణా:** కారణ రహితురాలైన ఆదిశక్తి, అమృత స్వరూపిణి.

153. **నిష్కళంకా:** కళంకరహితురాలై పరిశుద్ధ తత్త్వము గలది.

154. **నిరుపాధిః:** భేదబుద్ధి, అనేకత్వము లేని నిరుపాధియై అవిద్యారహితమైన చిత్స్వరూపిణియై యున్నది.

155. **నిరీశ్వరా:** దేవి అన్నిటికీ ఈశ్వరియేగాని ఆమెకీశ్వరుడు ఎవరూ లేరు. సాంఖ్యశాస్త్రము గూడ నిరీశ్వర వాదమును చెప్పుటచే దేవి సర్వేశ్వరి.

156. **నీరాగా:** ఇచ్ఛారహితురాలై భక్తుల ఇచ్ఛలను నెరవేర్చును.

157. **రాగమథనా:** రాగద్వేషాది క్లేశములను మథించు రాగరహితురాలు.

158. నిర్మదా : మత్సరరహితురాలు.

159. మదనాశినీ: మదమును నశింపజేయును.

160. నిశ్చింతా: దుఃఖములు లేక చింతలను తొలగించును.

161. నిరహంకారా: సాత్త్విక, రాజసిక, తామసిక అహంకారములు లేనిది.

162. నిర్మోహా: చిత్తభ్రాంతి, దేహాది జ్ఞానమైన మోహము లేనిది.

163. మోహనాశినీ: ద్వైతబుద్ధిని నశింపజేసి ఆత్మయొకటియే యను జ్ఞానము నొసగును.

164. నిర్మమా: జ్ఞానభిన్నమైన మమకారాదులు లేనిది.

165. మమతాహంత్రీ: స్వస్వరూప జ్ఞానమునొసగి మమత్వబుద్ధిని నశింపజేయును.

166. నిష్పాపా: పాపము లేనిది.

167. పాపనాశినీ: దేవీ రూప ధ్యాన మాత్రముచే పాపరహితులై పుణ్యాత్ములగుదురు.

168. నిష్క్రోధా: దేవికి ద్వేష, క్రోధములు లేక అందరినీ ప్రియముగ చూచును.

169. క్రోధశమనీ: కామక్రోధాదులలో క్రోధమును నశింపజేయును.

170. నిర్లోభా: మిక్కిలి ఔదార్య గుణమును కలిగి యుండును.

171. లోభనాశినీ: లోభగుణమును నశింప జేయును.

172. నిస్సంశయా: దేవి గురు రూపిణియై సర్వ సంశయములను తొలగించి తత్త్వమును తెలుపును.

173. సంశయఘ్నీ: ధ్యానించువారి సంశయములనన్నిటిని తొలగించును.

174. నిర్భవా: పుట్టుక లేనిది, మూలశక్తి, కారణబ్రహ్మ.

175. భవనాశినీ: భవబంధములనశింపజేసి ముక్తి నొసగును.

176. నిర్వికల్పా: సంకల్ప, వికల్పరహితురాలై రూపరహితమైన ఏకత్వ స్థితిగలది.

177. నిరాబాధా: శుక్తియందు రజతభ్రాంతి కలిగినను భ్రాంతి తొలగ గానే శుక్తికి బాధయుండదు. అట్లే దేవి యందు జగదాది భ్రాంతి కలిగినను జ్ఞానముచే ఆ భ్రాంతి తొలగి భ్రాంతి బాధారహితురాలగును. (శుక్తి = ముత్తెపు చిప్ప)

78. నిర్భేదా: భక్తులను భేదజ్ఞాన రహితులను గావించి బ్రహ్మ ఏకమని తెలుపును.

79. భేదనాశినీ: భేదబుద్ధిని తొలగించి జీవాత్మ, పరమాత్మ ఒకటేయను అద్వైత జ్ఞానమునిచ్చును.

180. నిర్నాశా: ఆదిమధ్యాంతములు లేనిది.

181. మృత్యుమథనీ: భక్తులకు మృత్యుముఖమున బడనీయక అమృతత్వము నొసగును.

182. **నిష్క్రియా:** విధి నిషేధములు లేక కర్తయు, కారణము అయి జగదాదులను సృష్టించును.

183. **నిష్పరిగ్రహా:** పరిగ్రహము లేనిది.

184. **నిస్తులా:** ఉపమానము లేక సాటి లేనిది.

185. **నీలచికురా:** నీలములైన వెండ్రుకలు కలది.

186. **నిరపాయా:** నాశము లేనిది.

187. **నిరత్యయా:** అతిక్రమాదులు లేనిది.

188. **దుర్లభా:** అసాధ్యురాలు.

189. **దుర్గమా:** సులభముగా దర్శనము కానిది. మరియు దుర్గముడను రాక్షసుని సంహరించినది.

190. **దుర్గా:** ఇంద్రాది దేవతలు శత్రువులచే విపరీతముగా పీడింపబడుటచే వారి భయము తొలగించి దుర్గాయని కీర్తింపబడినది.

191. **దుఃఖహంత్రీ:** సాంసారిక దుఃఖములను పోగొట్టును.

192. **సుఖప్రదా:** ఇహపరకైవల్యరూపములైన సుఖములను అధికముగా నొసగును.

193. **దుష్టదూరా:** దుష్టులకు దూరముగా నుండును.

194. **దురాచార శమనీ:** దేవి దురాచారములనన్నిటిని శమింపజేసి భక్తులను సదాచారపరును చేయును.

195. **దోషవర్జితా:** రాగద్వేషాదులు లేనిది.

196. **సర్వజ్ఞా:** సమస్తమునెరుగునది.

197. **సాంద్రకరుణా:** ఘనదయా స్వరూపిణి.

198. **సమానాధిక వర్జితా:** దేవితో సమానుడుకాని అధికుడు గాని లేడు.

199. **సర్వశక్తిమయీ:** సర్వదేవశక్తి సమూహ రూపము గలది.

200. **సర్వమంగళా:** భక్తుల దుఃఖములను తొలగించి వారికి శ్రేష్ఠమైన సకల శుభములనిచ్చును.

201. **సద్గతిప్రదా:** బ్రహ్మజ్ఞానమునొసగును.

202. **సర్వేశ్వరీ:** సర్వస్వామి భావముగలది యగుటచే సకలమునకు ఈశ్వరియని పిలువబడుచున్నది.

203. **సర్వమయీ:** భూమి మొదలు శివతత్త్వము వరకు గల అన్ని తత్త్వములూ దేవిమయములే.

204. **సర్వమంత్రస్వరూపిణీ:** సమస్తమైన ఏడుకోట్ల మంత్రములు స్వరూపముగా గలది.

205. సర్వయంత్రాత్మికా: ఘంటార్గళాది సకల యంత్రములు ఆత్మగా గలది.

206. సర్వతంత్రరూపా: సర్వతంత్రములు శరీరముగా కలది.

207. మనోన్మనీ: మనస్సు సంకల్ప, వికల్పరహితమై యుండు స్థితియే ఉన్మని. అట్టి స్థితియందు దేవిని ధ్యానింపవలయును.

208. మాహేశ్వరీ : సర్వభూతములకీశ్వరుడు, పంచవింశతి తత్త్వాతీతుడు మహేశ్వరుడు. అతని పత్ని మాహేశ్వరి·మహేశ్వర లక్షణ విశిష్టురాలు.

209. మహాదేవీ: పూజింప దగిన అనంత శరీరమును కలిగి యుండును.

210. మహాలక్ష్మీః: శివుని అంకమునందిన మాహేశ్వరీ శక్తియే మహాలక్ష్మీ.

211. మృడప్రియా : ప్రపంచస్థితి కర్తయు, సత్త్వగుణము గలవాడగు శివునకు మృడుడను సంజ్ఞగలదు. అట్టి మృడునకు ప్రియురాలు.

212 మహారూపా: శ్రేష్ఠమైన రూపము గలది.

213. మహాపూజ్యా: పూజ్యులైన శివాదుల చేతను గొప్పగా పూజింపదగినది.

214. మహాపాతకనాశినీ: బ్రహ్మహత్యాది మహాపాతకములను నశింపజేయును.

215. మహామాయా : ప్రాణులను పుట్టించి మాయా మోహితుల నొనర్చి ద్వంద్వ సహితుల చేయును. అట్టి మహామాయను దేవి నారాధించి అధిగమించ వలెను.

216. మహాసత్వా: గొప్పబలము, గుణము మొదలగునవి గలది.

217. మహాశక్తిః: గొప్ప సామర్థ్యము కలిగి దేవిని మించిన మరొక శక్తి లేదు.

218. మహారతిః: జ్ఞానులైన యోగులకు ప్రీతిపాత్రురాలు.

219. మహాభోగా: అధిక సుఖ, ధనములు గలది.

220. మహైశ్వర్యా: ఈశత్వము, సంపద విశేషముగా గలది.

221. మహావీర్యా: గొప్పవియైన శుక్రాది వీర్యములు గలది.

222 మహాబలా: గొప్పసైన్యాది బలము గలది.

223. మహాబుద్ధిః: గొప్పబుద్ధి గలది.

224. మహాసిద్ధిః: గొప్ప సిద్ధులు కలిగి సమత్వస్థితిని సిద్ధింప జేయును.

225. మహాయోగీశ్వరేశ్వరీ: గొప్ప ఈశ్వరులకు కూడా ఈశ్వరి.

226. మహాతంత్రా: అనేక ఫలములనొసగునట్టి తంత్రరూపిణి.

227. మహామంత్రా: బాలా బగళాది మహామంత్రములే దేవి.

228. మహాయంత్రా: సర్వతంత్రములలో స్వతంత్ర తంత్రము, సర్వ మంత్రములలో శ్రీవిద్య, సర్వ యంత్రములలో సిద్ధి వజ్రేశ్వరి దేవీ స్వరూపములు.

229. **మహాసనా:** అన్ని తత్త్వముల రూపమైన గొప్ప ఆసనములు గలది.

230. **మహాయాగక్రమారాధ్యా:** అరువది నాలుగు యోగినీ పూజలతో గూడిన మహో యాగముచే ఆరాధింపదగినది.

231. **మహాభైరవ పూజితా:** పరమ శివుని చేతను పూజింపబడునది.

232. **మహేశ్వరమహాకల్ప మహాతాండవసాక్షిణీ:** మహాప్రళయమునందు మహేశ్వరుడు విశ్వమునుపసంహరించి ఆత్మానందమునకై చేయు మహాతాండవ నృత్యమునకు సాక్షియై శివునితో శక్తి చేరియుండుటచే ఆమెయు జతగా నాట్యమాడి సంతసించును.

233. **మహాకామేశ మహిషీ:** మహాకామేశుడైన పరమ శివునకు పట్టపురాణి.

234. **మహాత్రిపురసుందరీ:** త్రిపుటియైన మాతృ, మాన, మేయములను నగరముల తాదాత్మ్యమునందిన సుందరి.

235. **చతుష్షష్ట్యుపచారాఢ్యా:** అరువది నాలుగు ఉపచారములతో ఆరాధింపదగినది.

236. **చతుష్షష్టి కలామయీ:** అరువది నాలుగు కళలు ప్రధానముగా గలది.

237. **మహాచతుష్షష్టి కోటి యోగినీ గణసేవితా :** అరువది నాలుగు కోట్ల యోగినులనబడు శక్తిగణములచే సేవింపబడును.

238. **మను విద్యా:** శ్రీ విద్యాప్రస్తారములోని భాగమైన మనువిద్యా స్వరూపిణి.

239. **చంద్రవిద్యా:** చంద్రవిద్యా స్వరూపిణి.

240. **చంద్రమండల మధ్యగా :** శ్రీ చక్రమే చంద్రమండలము. అట్టి చంద్రమండల మధ్య భాగమున నుండును. చంద్రమండలగతయైన దేవిని ధ్యానింపవలయును.

241. **చారురూపా:** అందమైన రూప లావణ్యములు గలది.

242. **చారుహాసా:** అందమైన చిరునగవు గలది. గురు భోధచే దేవీ మంత్రము నెరిగి స్మరించిన పరమానందము కలుగును.

243. **చారు చంద్రకళాధరా:** జ్ఞాన రూపచంద్రకలను ధరించినది.

244. **చరాచర జగన్నాథా:** జంగమ స్థావరాత్మకమైన జగత్తునకు అధీశ్వరి.

245. **చక్రరాజనికేతనా :** త్రైలోక్య మోహనము మొదలగు తొమ్మిది చక్రములు గృహముగా గలది.

246. **పార్వతీ:** పర్వతుని అనగా హిమవంతుని పుత్రిక.

247. **పద్మనయనా:** పద్మముల వలె అందమైన, విశాలమైన కన్నులుగలధి.

248. **పద్మరాగసమప్రభా:** మిక్కిలి ఎర్రనైన పద్మరాగమణితో సమానమైన కాంతిగలది.

249. **పంచప్రేతాసనాసీనా:** బ్రహ్మ, విష్ణు, రుద్ర ఈశ్వర, సదాశివులు శక్తి విరహితులై,

క్రియాశూన్యులై పంచప్రేతలగునపుడు వారి నధిష్టించి శక్తినిచ్చును.

250. **పంచబ్రహ్మ స్వరూపిణీ :** బ్రహ్మ, విష్ణు, రుద్ర ఈశ్వర, సదాశివులను పంచ బ్రహ్మలందు ఐక్యముగలదగుటచే పంచబ్రహ్మ స్వరూపిణియగుచున్నది.

251. **చిన్మయీ :** చిత్స్వ రూపిణి.

252. **పరమానందా :** ఉత్కృష్టమైన ఆనందము స్వరూపముగా గలది.

253. **విజ్ఞానఘన రూపిణీ :** జీవ సమష్టి రూపిణి అనగా చైతన్య స్వరూపిణి.

254. **ధ్యానధ్యాతృ ధ్యేయరూపా :** జ్ఞాన, జ్ఞాతృ, జ్ఞేయ రూపమైన త్రిపుటీ రూపమే దేవి.

255. **ధర్మాధర్మ వివర్జితా :** ధర్మా ధర్మ రహితురాలు.

256. **విశ్వరూపా :** విశ్వమునకాధారమగుటచే విశ్వము యొక్క రూపముగలది. శ్రీవిద్యను సృష్టించి విశ్వరూపయైనది.

257 **జాగరిణీ:** ప్రబోధాత్మకమైన సర్వేంద్రియ జ్ఞానముగల విశ్వుడనే జీవుని అవస్థ జాగరము. అట్టి జాగరా వస్థగలది.

258. **స్వపన్తీ :** నిద్రావస్థలో జీవునకు కలుగు మానసిక ప్రపంచానుభవమైన స్వప్నము దేవికి కూడాగలదు.

259. **తైజసాత్మికా :** సూక్ష్మదేహాభిమానులైన జీవుల సమష్టి రూపుడైన తైజసుడను హిరణ్యగర్భుని యొక్క ఆత్మగలది.

260. **సుప్తా :** అజ్ఞానము, అహంభావము, సుఖము అను మూడు వృత్తులు గల సుషుప్తావస్థ గల జీవుడు సుషుప్తుడు. అతని కంటె వేరుగానిది.

261. **ప్రాజ్ఞాత్మికా :** సమష్టి భూతమైన ప్రాజ్ఞాత్మ అనగా ఈశ్వరాత్మయే రూపముగా గలది.

262 **తుర్యా :** జాగ్రత్, స్వప్న, సుషుప్త అవస్థలను మించిన నాలుగవది తుర్యావస్థ. అది మనస్సును వికల్పరహితమొనర్చి ఆత్మజ్ఞానముతో పొందదగినది. అపుడు ఆనందానుభవము కలుగును. అట్టి స్థితిని దేవి కలిగించును.

263. **సర్వావస్థా వివర్జితా :** సర్వావస్థలను మీరిన పంచమా వస్థా స్వరూపిణి లలితామాత. అనగా ఈ స్థితిని పొందిన జీవుడు అహం బ్రహ్మాస్మి అన్న ఆత్మజ్ఞానమును పొందును.

264. **సృష్టికర్త్రీ :** సృష్టిని చేయునది.

265. **బ్రహ్మరూపా :** బ్రహ్మరూపము గలది.

266. **గోప్త్రీ :** గోపనము - జగత్తు యొక్క రక్షణ. జగత్తును పరిపాలించును.

267. **గోవిందరూపిణీ :** గోవింద రూపుడైన విష్ణువే ఈశ్వరుడు. అట్టి రూపము గలది.

268. **సంహారిణీ :** విశ్వసంహారమునొనర్చును.

269. **రుద్రరూపా :** దుఃఖములను పోగొట్టు రుద్రుడైన పశుపతి యొక్క రుద్రరూపము గలది.

270. **తిరోధానకరీ :** సంపూర్ణలయమును చేయు తిరస్కరిణియను శక్తి రూపము గలది.

271. **ఈశ్వరీ:** శుద్ధ సత్త్వగుణము ప్రధానముగా గల ఈశ్వరుని కంటె వేరు గానిది.

272. **సదాశివా :** శుద్ధ సత్త్వ ప్రధానుడైన ఈశ్వరుడే సదా శివుడు. అట్టి సదా శివరూపముతో భేదము లేనిది.

273. **అనుగ్రహదా :** పునస్సృష్టి కారకమైన అనుగ్రహమునొసగును.

274. **పంచకృత్య పరాయణా :** సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహములను పంచకృత్యములందా సక్తి కలిగి యుండును.

275. **భానుమండల మధ్యస్థా :** సూర్య మండలము యొక్క మధ్యనుండును. సంధ్యాసమయమందు దేవిని సవితృమండల మధ్యగతురాలినిగ ధ్యానింప వలయును.

276. **భైరవీ :** భైరవుడైన పరమశివుని భార్య.

277. **భగమాలినీ :** భగదేవతల మాలికచే చుట్టబడినది.

278. **పద్మాసనా :** బ్రహ్మరూపిణి యగుటచే దేవి పద్మాసనాయగుచున్నది.

279. **భగవతీ :** భగశబ్దార్థములు 1. ఐశ్వర్యము 2. అనుగ్రహము 3. ధర్మము 4. కీర్తిలక్ష్మి 5. జ్ఞానము 6. విజ్ఞానము ఈ ఆరు గుణములు కలిగి భగవతియని పిలువబడును. సకల భూతములచే సేవింపబడును.

280. **పద్మనాభ సహోదరీ :** విష్ణువునకు తోబుట్టువై కృష్ణావతారమున సుభద్రగా జన్మించినది.

281. **ఉన్మేషనిమిషోత్పన్న విపన్నభువనావళీ :** ఉన్మేష - నేత్ర వికాసము, నిమిష - కన్నుల మూత. ఆక్రమమున సృష్టియగుచు నశించుచుండు బ్రహ్మాండముల గుంపుగలది.

282. **సహస్ర శీర్షవదనా :** సహస్రము - అనంతము. అనంత ముఖాదులు కలిగి సమస్తము వ్యాపించియున్నది.

283. **సహస్రాక్షీ:** వేయి కన్నులతో అంతటా వీక్షించును.

284. **సహస్రపాత్ :** వేయికన్నులు, వేయిచేతులు, వేయిపాదములతో ప్రకాశించును.

285. **ఆబ్రహ్మకీటజననీ :** బ్రహ్మ మొదలు కీటకము వరకు గల సకల శరీరధారులైన జీవులను సృష్టించును.

286. **వర్ణాశ్రమ విధాయినీ :** దేవి ఆజ్ఞచే బ్రహ్మ వర్ణములను సృష్టించి, ఆశ్రమముల నేర్పరిచి ఆయా ధర్మములను వారి వారికి నియోగించెను.

287. **నిజాజ్ఞా రూపనిగమా :** దేవి ఆజ్ఞా రూపములే వేదములు, కామి కాది తంత్రములు.

288. **పుణ్యాపుణ్య ఫలప్రదా :** పుణ్యా పుణ్య కర్మముల ఫలములనిచ్చును.

289. **శ్రుతిసీమన్త సిందూరీకృత పాదాబ్జ ధూళికా :** ఆమె పాదాబ్జ ధూళివలె దేవి స్వరూపము వర్ణింపబడినది. సిందూరముగా చేయబడిన రహస్యార్థములైన పాదకమలముల ధూళి గలది.

290. **సకలాగమ సందోహశుక్తి సంపుట మౌక్తికా :** సమస్త వేదముల సమూహమనెడి ముత్తెములతో కూర్చబడిన నాసాభరణమును ధరించును. అనగా వేదాదులు కూడా ఆమె రూపమును వర్ణింప సమర్థములు కావు. అనగా ఆమె వాచామగోచర.

291. **పురుషార్థప్రదా :** చతుర్విధ పురుషార్థములనొసగును.

292. **పూర్ణా :** శుక్ల పక్ష చతుర్దశీ రాత్రి స్వరూపముగలది.

293. **భోగినీ :** సుఖసాక్షాత్కారముగలది.

294. **భువనేశ్వరీ :** చతుర్దశ భువనాధీశ్వరి.

295. **అంబికా :** జగన్మాత, వాగ్రూపిణి, భూస్వరూపిణి, ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తి స్వరూపిణి.

296. **అనాది నిధనా :** ఆద్యంతరహితయై భక్తులను కాపాడును.

297. **హరిబ్రహ్మేంద్రసేవితా :** విష్ణు, బ్రహ్మ, ఇంద్రులచే సేవింపబడు దేవియే మోక్షార్థమై సేవింపదగినది.

298. **నారాయణీ :** శివునకు నారాయణుడను పేరుండుటచే ఆతనిభార్య నారాయణి. లక్ష్మి, పార్వతులకు భేదము లేక పోవుటచే నారాయణి యని పిలువబడును.

299. **నాదరూపా :** నాదస్వరూపముగలది.

300. **నామరూపవివర్జితా :** జగద్రూపములైన నామ రూపములు మిధ్యయగుటచే వానిచే వదలబడి నామ రూపములు లేనిది. అనగా జ్ఞానశక్తిచే నామరూపములు నశించి బ్రహ్మ ఒక్కడే మిగులును.

301. **హ్రీంకారీ :** హకారము సృష్టిని, రకారము స్థితిని, ఈకారము లయమును, బిందువు (మకారము) ఆమూటిని అధికారముతో నుంచును. అట్టి వానిని చేయుటచే హ్రీంకారీ యని పిలువబడును.

302. **హ్రీమతీ :** లజ్జగలదిగాన హ్రీమతి మరియు మతి, తుష్టి, పుష్టులుగలది.

303. **హృద్యా :** మునుల హృదయములందు నివసించు మనోజ్ఞురాలు.

304. **హేయోపాదేయవర్జితా :** ఇష్టానిష్టములచే వదలబడినది.

305. **రాజరాజార్చితా :** రాజరాజు - మనువు, కుబేరుడు. వారిచే పూజింపదగినది.

306. **రాజ్ఞీ:** రాజ రాజేశ్వరుని పట్టపురాణి.

307. **రమ్యా:** సౌందర్యవతి.

308. **రాజీవలోచనా:** పద్మము వంటి కన్నులు. గలది.

309. **రంజనీ:** భక్తులను రంజింపజేయును.

310. **రమణీ:** భక్తులను రమింపజేయును.

311. **రస్యా:** రసించుటకు, ఆస్వాదించుటకు అనగా దేవి నామామృతమును ఆస్వాదించుటకు యోగ్యమైనది.

312. **రణత్కింకిణి మేఖలా:** శబ్దించు చిరుగంటల మొలనూలు గలది.

313. **రమా:** లక్ష్మీ స్వరూపురాలు.

314. **రాకేందువదనా:** రాకాచంద్రునివంటి అనగా పూర్ణచంద్రుని వంటి ముఖముగలది.

315. **రతిరూపా:** రతీదేవి రూపమువంటి మనోహరమైన రూపముగలది.

316. **రతిప్రియా:** రతీదేవికిష్టురాలు.

317. **రక్షాకరీ:** రక్షణ కలిగించునది.

318. **రాక్షసఘ్నీ:** రాక్షసులను చంపునది.

319. **రామా:** స్త్రీమాత్ర రూపమున ముల్లోకములందు కనిపించు ఈమెను యోగులు దర్శించి ఆనందింతురు.

320. **రమణలంపటా:** ఆనందించుట యందాసక్తి గలది.

321. **కామ్యా:** జ్ఞానముముక్షువులచే కోరదగినది.

322. **కామ కలారూపా:** కామేశ్వరీ, కామేశ్వరుల రూపము గలది.

323. **కదంబ కుసుమప్రియా:** కదంబ కుసుమములందు ప్రీతిగలది.

324. **కల్యాణీ:** మంగళ స్వరూపము కలిగి, మంగళకరమైన వాక్కులను పలుకును.

325. **జగతీకన్దా:** లోకములకు మూలమై లోకములను ప్రేమతో నిండించును.

326. **కరుణారససాగరా:** దయారసముగల సముద్ర రూపము గలది.

327. **కలావతీ:** అరువది నాలుగు కళలు గలది.

328. **కలాలాపా:** కళలే సంభాషణగాను, ఇంపైన ఆలాపములు గలది.

329. **కాంతా:** కమనీయురాలు.

330. **కాదంబరీప్రియా:** కాదంబరి ప్రియముగా గలది.

331. **వరదా:** ఉపాసకులకు వరములనొసగును.

332. **వామనయనా:** సుందరమైన కన్నులు గలది.

333. **వారుణీమద విహ్వలా:** వారుణీరస పానముచే ఆత్మానందమును అమితముగా అనుభవించును.

334. **విశ్వాధికా:** సమస్త విశ్వమున కంటె అధికురాలు.

335. **వేదవేద్యా:** నాలుగు వేదములచే ఎరుగ దగినది.

336. **వింధ్యాచల నివాసినీ:** వింధ్య పర్వతమునందు నివసించును.

337. **విధాత్రీ:** జగత్తులను ధరించి పోషించును.

338. **వేదజననీ:** వేదములకు తల్లి.

339. **విష్ణుమాయా:** దేవినాశ్రయించిన వారు విష్ణుమాయను సులభముగా అతిక్రమింతురు.

340. **విలాసినీ:** విలాసమను పీఠశక్తి రూపము గలది.

341. **క్షేత్రస్వరూపా:** స్థూలశరీరములు, దాని ప్రకృతి దేవి నిజస్వరూపముగా గలది.

342. **క్షేత్రేశీ:** శరీరమున కీశుడు శివుడు. అతనికి సంబంధించినది క్షేత్రేశి. క్షేత్రములను, స్థూల శరీరములను అనగా ప్రకృతిని పాలించును.

343. **క్షేత్ర క్షేత్రజ్ఞ పాలినీ:** క్షేత్రము - శరీరము. దానినెరిగిన వాడు క్షేత్రజ్ఞుడు. వానిని పరిపాలించునది.

344. **క్షయవృద్ధి వినిర్ముక్త:** కర్మల వలన ఏర్పడు వృద్ధి, క్షయములు దేవికి కలుగవు. బ్రహ్మజ్ఞానికి అంటవు.

345. **క్షేత్రపాలసమర్చితా:** క్షేత్రము - యోగశాల, దానిని పాలించువాడు క్షేత్రపాలుడు. అతనిచే పూజింపదగినది.

346. **విజయా:** గొప్ప విజయముగలది. జ్ఞానమేరూపముగా గలది.

347. **విమలా:** వి-తొలగిన, మల - అవిద్య. తొలగిన అవిద్యగలది.

348. **వంద్యా:** నమస్కరింపదగినది.

349. **వందారు జనవత్సలా:** ఆరాధించు జనులయందు వాత్సల్యము, ప్రీతి గలది.

350. **వాగ్వాదినీ:** వాక్కులను పలుకునది.

351. **వామకేశీ:** అందమైన కేశములు గలది.

352. **వహ్నిమండల వాసినీ:** సోమ, సూర్య, అగ్ని మండలత్రయము నందు నివసించును.

353. **భక్తిమత్కల్పలతికా:** భక్తులకు కల్పతరువు వలె ఇష్టమైన కోరికలనిచ్చును. కొద్ది భక్తి గల వారికి సంపూర్ణ భక్తినిచ్చి సంతసించును.

354. పశుపాశ విమోచనీ : దైవము నుండి వేరని భావించు వాడిని పశువని అందురు. అదియే అవిద్య. ఇట్టి అవిద్యాపాశము నుండి తొలగించి ముక్తినొసగును.

355. సంహృతాశేష పాషండా : పాషండులను సమూలముగా నశింపజేసి ధర్మమార్గమును ప్రతిష్ఠించును.

356. సదాచారప్రవర్తికా : వేదాదులందు చెప్పబడిన సదాచారములను ప్రవర్తింపజేయును.

357. తాపత్రయాగ్ని సంతప్త సమాహ్లాదన చంద్రికా : తాపత్రయాగ్నిచే తపించు వారికి వెన్నెలలా తాపములను పోగొట్టి ఆనందమును కలిగించును.

358. తరుణీ : నిత్యయౌవనముగలది.

359. తాపసారాధ్యా : తపోవంతులచే ఆరాధింపబడునది.

360. తను మధ్యా : కాంచీదేశమున తను మధ్యాయను దేవిగా పూజింప బడుచున్నది.

361. తమోపహా : అవిద్యను పోగొట్టును.

362. చితిః : అవిద్యకు శత్రువై జ్ఞాన స్వరూపమైనది.

363. తత్పదలక్ష్యార్థా : తత్త్వమసియను మహా వాక్యమందలి తత్పదము యొక్క లక్ష్యార్థమైన కర్తృత్వ, అకర్తృత్వ బ్రహ్మల తాదాత్మ్యమును తెలుపును.

364. చిదేకరసరూపిణీ : ఆనంద చైతన్యాది ధర్మములు స్వరూపముగా గలది.

365. స్వాత్మానందలవీభూత బ్రహ్మాద్యానంద సంతతీ : దేవి యొక్క ఆనందసాగరమున బ్రహ్మాదుల ఆనందము మరియు ఇతరానందములన్నియు సముద్రమున నీటి బొట్లు వలె లవలేశములే.

366. పరా : శబ్ద బ్రహ్మము, పరారూపిణి, గొప్పదైన పరావాక్కు అవ్యక్తేశ్వరుడనియు, శాంతయనియు, అంబిక యనియు చెప్పబడును.

367. ప్రత్యక్చితీరూపా : ఆత్మజ్ఞానమును పొందుట ప్రత్యక్చితి. ఆమె అవ్యక్తమైన బ్రహ్మరూపముగలది.

368. పశ్యంతీ : అన్నిటిని తన ఆత్మయందు చూచును. పశ్యంతీవాక్స్వరూపిణి.

369. పరదేవతా : ఉపాసింపదగిన పరమేశ్వరి, దేవదేవి.

370. మధ్యమా : పశ్యంతి, వైఖరిల మధ్యనుండు మధ్యమా వాక్స్వరూపిణి.

371. వైఖరీ : ఘన భావము గల వైఖరీ రూపముగలది.

372. భక్తమానస హంసికా : భక్తుల మనస్సులను మానస సరస్సులందు హంసివలె విహరించును.

373. **కామేశ్వర ప్రాణనాడీ :** శివకామేశ్వరునకు ప్రాణనాడి. శివుడు కాలకూట విషమును త్రాగినను తల్లి మహిమచేమరణము నందలేదు.

374. **కృతజ్ఞా:** కృతయుగమునందలి ధర్మము వలె జ్ఞానము గలది.

375. **కామపూజితా:** మన్మథునిచే పూజింపబడును.

376. **శృంగార రస సంపూర్ణా:** శృంగార రసముచే పూర్తిగా నిండినది. అనగా శుద్ధ బ్రహ్మ స్వరూపిణి.

377. **జయా:** జయస్వరూపిణి.

378. **జాలంధర స్థితా:** విష్ణుముఖి అను పేరుతో జాలంధరమను పీఠమునందు నివాసము కలిగి పూజింపబడును.

379. **ఓడ్యాణ పీఠనిలయా:** ఓడ్యాణ మను పీఠమేవాస స్థానముగా గలది.

380. **బిందు మండలవాసినీ:** బ్రహ్మరంధ్రమున నివసించును.

381. **రహోయాగక్రమారాధ్యా:** రహోయాగము (రహస్యమున చేయబడుయాగము) చే ఆరాధింపదగినది.

382. **రహస్తర్పణ తర్పితా:** భూమి మొదలు శివుని వరకు గల సకల విశ్వమును హోమము చేయుటయును మంత్రార్ధమును ఊహించుటను రహస్తర్పణమందురు. దాని వలన దేవి తృప్తి పొంది జ్ఞానయోగులకు మోక్షమునిచ్చును.

383. **సద్యః ప్రసాదినీ :** రహోయాగముచే రహస్తర్పణముచే దేవి సులభముగా, తక్షణమే అనుగ్రహించును.

384. **విశ్వసాక్షిణీ :** విశ్వమునకు సాక్షీభూతురాలై తనను నమ్ముకొన్నవారికి స్వల్ప వ్యవధిలో ఆత్మజ్ఞానమునిచ్చును.

385. **సాక్షివర్జితా:** సర్వమునకు సాక్షిగా నుండుటచే వేరొక సాక్ష్యములేనిది.

386. **షడంగ దేవతాయుక్తా:** షడంగములైన 1. హృదయము. 2. శిరస్సు 3. శిఖ 4. నేత్రము 5. కవచము 6. అస్త్రము వాటికి దేవతయైన శివునితో గూడియుండును.

387. **షాడ్గుణ్యపరిపూరితా:** ఆరుగుణములైన 1. ఐశ్వర్యము 2. ధర్మము 3. యశస్సు 4. శ్రీ 5. జ్ఞానము 6. వైరాగ్యము, వానిచే పరిపూర్ణమైయుండును.

388. **నిత్యక్లిన్నా:** నిత్యము దయార్ద్రమైయుండు కరుణావతి.

389. **నిరుపమా:** సాటిలేనిది.

390. **నిర్వాణ సుఖదాయినీ:** మోక్ష సుఖమునిచ్చును.

391. **నిత్యాషోడశికారూపా :** కామేశ్వరి మొదలు త్రిపురసుందరి వరకు గల పదునారు దేవతలైన నిత్యా దేవతలతో గూడియున్న షోడశికా రూపిణి.

392. **శ్రీకంఠార్థ శరీరిణీ :** శివుని శరీరార్థ భాగము నాక్రమించిన వాక్ష రూపిణి.

393. **ప్రభావతీ :** కాంతి గుణము గలది.

394. **ప్రభారూపా :** దేవి కాంతిరూపిణి.

395. **ప్రసిద్ధా :** దేవి సోహమని ప్రసిద్ధి చెందినది.

396. **పరమేశ్వరీ :** పరాత్పరురాలైన ఈశ్వరి.

397. **మూలప్రకృతిః :** మూలము (శ్రీవిద్యామంత్రము) నకు ప్రకృతియైనది.

398. **అవ్యక్తా :** విశ్వ వ్యాప్తురాలు, విష్ణు స్వరూపురాలు.

399. **వ్యక్తా వ్యక్త స్వరూపిణీ :** అవ్యక్తము - నశింపనిది, అక్షరమైనది. వ్యక్తము - క్షరమైనది, నశించునది. అట్టి క్షరాక్షర రూపిణి.

400. **వ్యాపినీ :** సర్వవ్యాప్తియై యుండును.

401. **వివిధాకారా :** వివిధాకారములు దేవియే.

402. **విద్యావిద్య స్వరూపిణీ :** విద్య, అవిద్య, ఆత్మ స్వరూపములుగలది.

403. **మహాకామేశ నయన కుముదాహ్లాద కౌముదీ :** మహా కామేశుని కన్నులనెడి కలువలను వికసింపజేయు వెన్నెల లలితా దేవి. కౌముదమన కార్తీక మాసమందలి వెన్నెల అనగా శివుని కడకు భక్తులను చేర్చునట్టి వెలుగు.

404. **భక్తహార్ద తమోభేద భానుమద్భాను సంతతిః :** భక్తుల హృదయములందుండు తమస్సులను అజ్ఞానములను నాశము చేయుటలో సూర్యకిరణ పరంపరలాప్రకాశించును.

405. **శివదూతీ :** శివుని దూతగా నియమించి సందేశము నందజేయును.

406. **శివారాధ్యా :** శివునిచే ఆరాధింపబడునది.

407. **శివమూర్తిః :** శివశక్తులకు భేదములేనందున శివుడే స్వరూపముగా గలది. శివయన మంగళము గాన మంగళకరమూర్తి. శివయన మోక్షముగాన మోక్ష స్వరూపిణి.

408. **శివంకరీ :** అవిద్యాపాశమును తొలగించి భక్తుని శివునిగా జేయును.

409. **శివప్రియా :** శివునకు ప్రియమైనది.

410. **శివపరా :** భక్తులకు శివుని గూర్చి తెలుపును.

411. **శిష్టేష్టా :** ధర్మములనాచరించు బ్రాహ్మణులు శిష్టులు. వారు తనకిష్టులై వారిచే పూజింపబడును.

412. **శిష్టపూజితా :** వేదమార్గగాములు, సదాచార సంపన్నులునైన శిష్టులచే పూజింపబడును.

413. **అప్రమేయా :** జలమందు తెలియదగినది, అనంతమైనది.

414. స్వప్రకాశా: స్వయముగా ఆత్మస్వరూపముగా ప్రకాశించును.

415. మనోవాచామగోచరా: పరిపక్వమైన, పరిపూర్ణమైన మనో వాక్కులకు మాత్రమే గోచరించును.

416. చిచ్ఛక్తిః: అవిద్యను తొలగించు సామర్థ్యముగల విద్యచైతన్యము. అట్టి చైతన్యమే చిచ్ఛక్తి. అన్ని ప్రాణులందుండు చిచ్ఛక్తి ఆమెరూపమే యగుటచే ఆమె విద్యారూపిణి, చైతన్య రూపిణి, చిచ్ఛక్తి రూపిణి.

417. చేతనా రూపా: చైతన్యరూపమే శక్తి. దేవి చైతన్య రూపిణి, గాయత్రి, ఆనంద రూపిణి, చిద్రూపిణి.

418. జడశక్తిః: బ్రహ్మ శక్తివలన కలుగు జడసృష్టికి దేవి శక్తియే కారణము. జడాత్మక విశ్వమును సృష్టించుటకేర్పడిన మాయా పరిణామమే జడశక్తి.

419. జడాత్మికా: జడమన దృశ్యమాత్రము. అట్టి దృశ్యమానమైన, మాయాత్మకమైన జడరూపమే ఆత్మగా కలిగి యుండును.

420. గాయత్రీ: వేదమాతయు, గానము చేయువారిని రక్షించు గాయత్రి రూపము.

421. వ్యాహృతిః: వ్యాహృతియను మంత్రవిశేషరూపము గలది.

422. సంధ్యా: ఆదిత్యుని కంటె వేరుగాని చైతన్య రూపమైనది సంధ్య. గాయత్రీ చతుర్ధ పాదరూపిణి సంధ్య. అట్టి సంధ్యారూపమే దేవి. సంధికాలమందు పాసింపదగిన దేవత.

423. ద్విజ బృంద నిషేవితా: బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులను ద్విజ సమూహములచే నిరతము సేవింపబడును.

424. తత్త్వాసనా: శివుడు మొదలు పృథివ్యంతములైన ముప్పది యారుతత్త్వముల నెడు యోగపీఠమను పేరుగల ఆసనము గలది.

425. తత్త్వమయీ: అందరి అన్ని బుద్ధులందు. మనస్సులందు తిరుగాడుచుండును.

426. తుభ్యంవమః: త్వం అను పదముచే చెప్పదగిన నిర్గుణ పరబ్రహ్మనే తెలుపును.

427. అయ్యైవమః: శుభమును కలిగించును.

428. పంచకోశాంతర స్థితా: పంచకోశమంత్రాధిష్ఠానమైనది.

429. నిస్సీమ మహిమా: నిరవధికమై హద్దులు లేని మహిమ గలది.

430. నిత్యయౌవనా: నిత్యయౌవనము గలది.

431. మదశాలినీ: మదము - వేరు విషయ సంబంధము లేని ఆనందవిషయము. అట్టి ఆనందముచే ప్రకాశించును.

432. మదఘూర్ణితరక్తాక్షీ: పరబ్రహ్మానందముచే, లౌకిక విషయరాహిత్యముచే ఎఱ్ఱనైన కన్నులుగలది.

433. **మదపాటల గండభువా :** మదము (కస్తూరి), పాటలమను పుష్పముచే ఆమె చెక్కిళ్లు చిత్రింపబడినవి.

434. **చందనద్రవదిగ్ధాంగీ :** ఆమె అవయవములు మంచి గంధసారముచే పూయబడియుండును.

435. **చాంపేయ కుసుమప్రియా :** చంపక పుష్పముపై ప్రీతిగలది.

436. **కుశలా :** సృష్ట్యాది నిర్మాణములందు నేర్పుగలది. చంద్రకాంతిని అతిశయించిన కాంతిగలది.

437. **కోమలాకారా :** సుకుమారాకారము గలది.

438. **కురుకుళ్లా :** కురువింద రత్నములపై నివసించును.

439. **కుళేశ్వరీ :** కుళము - సజాతీయములైన మాతృమానమేయముల సమూహము. అనగా త్రిపుటికి ఈశ్వరి.

440. **కులకుండాలయా :** మూలాధారమందలి కుండలిని ఆలయముగా గలది.

441. **కౌళమార్గతత్పర సేవితా :** కులమార్గముననుసరించి వివిధములైన నైవేద్యములతో పూజింపదగినది.

442. **కుమార గణనాథాంబా :** కుమారస్వామికి, వినాయకునికి తల్లి. మరియు భక్తుల అహంకారమును తొలగించి మోక్షమునిచ్చును.

443. **తుష్టిః :** సకలప్రాణులకు ఆనందమునిచ్చును.

444. **పుష్టిః :** దేవదారు వనమందు పుష్టియను పేరుతో పిలువబడుచున్నది.

445. **మతిః :** ఆలోచనాశక్తి గల మతిస్వరూపిణి.

446. **ధృతిః :** పిండారక క్షేత్రముననుండు దేవి.

447. **శాంతిః :** మాయ, కర్మలచే బాధపడు జీవులకు సుఖస్థానము కల్పించు శాంతియే దేవి.

448. **స్వస్తిమతీ :** సత్యమునకు సత్యమైన పరబ్రహ్మరూపిణి.

449. **కాంతిః :** ఇచ్ఛా శక్తి రూపిణి, తేజోవతి.

450. **నందినీ :** ఆనందింపజేయునది.

451. **విఘ్ననాశినీ :** విద్యకు బాధాకరమైన అవిద్యను నశింపజేయు శీలము గలది.

452. **తేజోవతీ :** సూర్యుడు మొదలగు తేజస్సులకు ఆధారభూతురాలు.

453. **త్రినయనా :** చంద్ర, సూర్య, అగ్ని రూపములైన మూడు నేత్రములు కలది.

454. **లోలాక్షీ కామరూపిణీ :** యోగేశ్వరీ రూపము గలది.

455. **మాలినీ :** మాలగలది.

456. హంసినీ: హంసలను యతులీమెయందు అభేదముగా నుందురు.

457. మాతా: అందరిని పుట్టించు తల్లి. మంత్రములన్నిటికి తల్లి. మాతృకా అనగా అక్షరములు రూపముగా గలది. అందుచే లక్ష్మీ బీజమునకు గూడా మాతయను పేరుగలదు.

458. మలయాచల వాసినీ: మలయాచలమందు నివసించును.

459. సుముఖీ: బ్రహ్మ విదుని వలె ఆమె ముఖము ప్రకాశించు చుండును.

460. నళినీ: పద్మరూపము గలది.

461. సుభ్రూః: మంగళకరమైన కనుబొమలు కలిగి యుండును.

462. శోభనా: సౌందర్యము గలది.

463. సురనాయికా: దేవతలకు మహత్తర శక్తియు, నాయిక.

464. కాలకంఠీ: కాలకంఠుడైన శివుని భార్య లేక నల్లని కంఠము గలది.

465. కాంతిమతీ: అనన్య ప్రకాశముతో ఒప్పచుండును.

466. క్షోభిణీ: సృష్టియందు దేవి మనస్సు క్షోభితమై యుండును.

467. సూక్ష్మ రూపిణీ : తెలియుటకు శక్యముగాని సూక్ష్మ రూపమును కలిగియుండును.

468. వజ్రేశ్వరీ : జాలంధర పీఠమందుండు షష్ఠీతిథి నిత్యా దేవియే వజ్రేశ్వరి. మరియు వజ్రములతో గూడిన నగలు ధరించి వజ్రములనొసగుటచే సంతసించును. ఇంద్రునకు వజ్రాయుధము నిచ్చెను.

469. వామదేవీ: వామభాగమందు ప్రకాశించుచు కర్మఫలములనొసగు అధిష్ఠాన దేవి.

470. వయోవస్థా వివర్జితా : వయసుకు సంబంధించిన అవస్థలు లేనిదై పరారూపముతో నుండును.

471. సిద్ధేశ్వరీ: గోరక్షకాది సిద్ధులకీశ్వరి. ఈ పేరుతో కాశియందు ప్రసిద్ధురాలు.

472. సిద్ధ విద్యా: సిద్ధ విద్యారూపిణి.

473. సిద్ధ మాతా: సిద్ధులకు తల్లియై వారిని రక్షించును.

474. యశస్వినీ: గొప్ప కీర్తి గలది.

475. విశుద్ధి చక్రనిలయా : పదహారు రెక్కల కమలము యొక్క కర్ణికయందు నివసించును.

476. ఆరక్తవర్ణా: అంతటా ఎర్రని రంగుతో ప్రకాశించుచుండును.

477. త్రిలోచనా: మూడు కన్నులు గలది.

478. **ఖట్వాంగాది ప్రహరణా :** ఖట్వాంగము మొదలగు నాలుగు ఆయుధములు గలది.

479. **వదనైక సమన్వితా :** ఒకే ముఖముతో వికసించును.

480. **పాయసాన్నప్రియా :** పాయసాన్నము ఇష్టముగా కలిగి యుండును.

481. **త్వక్స్థా :** చర్మము నధివసించును.

482. **పశులోక భయంకరీ :** ద్వైతభావము గల పశులోకమునకు భయమును కలిగించును.

483. **అమృతాది మహాశక్తి సంవృతా :** అమృతాది అక్షరాంతములైన పదహారు మహాశక్తులతో అమృత, ఆకర్షిణి, ఇంద్రాణి మొదలగు వారు ఒక్కొక్క దళము నందున్న వారితో ఆవరింపబడియుండును.

484. **డాకినీశ్వరి :** డాకినియను పేరుగల ఈశ్వరి.

485. **అనాహతాబ్జ నిలయా :** అనాహత కమల కర్ణికయందు నివసించును.

486. **శ్యామాభ్యా :** నల్లని కాంతిగలది.

487. **వదనద్వయా ;** రెండు మోములుగలది.

488. **దంష్ట్రోజ్జ్వలా :** వరాహము యొక్క దంతములతో సమానమైన దంతములతో ప్రకాశించును.

489. **అక్షమాలాదిధరా :** అక్షమాల మొదలగు నాలుగు ఆయుధములను ధరించును.

490. **రుధిర సంస్థితా :** రక్తమందు ప్రీతిగలిగి అందు నివసించును.

491. **కాళరాత్ర్యాది శక్త్యౌఘవృతా :** కాళరాత్రి శక్తి మొదలగు పన్నెండు శక్తుల సమూహముచే ఆవరింపబడియుండును.

492. **స్నిగ్ధౌదనప్రియా :** నేతితో కలిసిన అన్నము ప్రియముగా గలది.

493. **మహావీరేంద్రవరదా :** మహావీరేంద్రులైన ప్రహ్లాద, ఇంద్రులకు వరములనిచ్చి యున్నది.

494. **రాకిణ్యంబా స్వరూపిణీ :** రాకిణియను పేరుగల దేవి యొక్క రూపమును కలిగియున్నది.

495. **మణిపూరాబ్జనిలయా :** మణిపూరమను కమలము స్థానముగా కలిగి యున్నది.

496. **వదనత్రయ సంయుతా :** మూడు ముఖములతో ఒప్పియున్నది.

497. **వజ్రాది కాయుధోపేతా :** వజ్రము మొదలగు నాలుగు ఆయుధములతో కూడియుండును.

498. **డామర్యాదిభిరావృతా :** డామరి మొదలు ఘట్కారణి వరకు గల పది శక్తులచే ఆవరింపబడి యుండును.

499. రక్తవర్ణా: రక్తము వంటి ఎర్రని రంగు కలిగి యుండును.

500. మాంసనిష్ఠా: మాంసముపై అభిమానము కలిగి యుండును.

501. గుడాన్నప్రీతమానసా: బెల్లముతో గూడిన అన్నమందు ఆమె మనస్సు ప్రీతినొందును.

502. సమస్త భక్త సుఖదా: భక్తులందరకు సర్వసౌఖ్యములనిచ్చును.

503. లాకిన్యాంబాస్వరూపిణి: లాకినియను పేరుగల దేవియొక్క స్వరూపముగలది.

504. స్వాధిష్ఠానాంబుజగతా: స్వాధిష్ఠానమను కమలమును పొందియున్నది.

505. చతుర్వక్త్ర మనోహరా: నాలుగు మోములతో మనోజ్ఞముగానుండును.

506. శూలాద్యాయుధ సంపన్నా: శూలము మొదలగు ఆయుధములతో కుడి యుండును.

507. పీతవర్ణా: పసుపు వర్ణమును కలిగియుండును.

508. అతిగర్వితా: సౌందర్యాదుల అతిశయముతో ఒప్పుచుండును.

509. మేదోనిష్ఠా: మేదస్సను ధాతువునందు ఉనికి గలది.

510. మధుప్రీతా: తేనియ ఇష్టముగా గలదియై మధువుచే హోమము చేసిన సంతుష్టురాలగును.

511. బంధిన్యాది సమన్వితా: బంధిని మొదలగు వారితో కూడినది.

512. దధ్యన్నాసక్త హృదయా: పెరుగు అన్నము ప్రీతిగా గల హృదయము గలది.

513. కాకినీ రూపధారిణీ: కాకిని యొక్క రూపమును ధరించినది.

514. మూలాధారాంబుజారూఢా: మూలాధారమను కమల కర్ణికను అధిష్ఠించి యుండును.

515. పంచవక్త్రా: ఐదు మోములుగలది.

516. అస్థి సంస్థితా: ఎముకలందూ ఉండును.

517. అంకుశాది ప్రహరణా: అంకుశము మొదలగు నాలుగు ఆయుధములను కలిగి యుండును.

518. వరదాది నిషేవితా: వరదాశక్తి మొదలు సరస్వతి అంతముగా గల నాలుగు శక్తులచే సేవింపబడును.

519. ముద్గౌదనాసక్త చిత్తా: మినప పప్పుతో కలిసిన అన్నమందాసక్తిగలది.

520. సాకిన్యంబా స్వరూపిణీ: సాకిన్యంబ స్వరూపముగలది.

521. ఆజ్ఞాచక్రాబ్జనిలయా: ఆజ్ఞాచక్రమను కమలమందు నివసించును.

522. శుక్లవర్ణా: తెల్లని రంగుగలది.

523. **షడాననా :** ఆరు ముఖములు గలది.

524. **మజ్జాసంస్థా :** మజ్జధాతువునందభిమానము గలది.

525. **హంసవతీ ముఖ్యశక్తి సమన్వితా :** హంసవతి ముఖ్యలైన శక్తులతో కూడినది.

526. **హరిద్రాన్నైక రసికా :** పసుపుతో గూడిన అన్నమందు ప్రీతి గలది.

527. **హాకినీ రూపధారిణీ :** హాకినియను దేవీ రూపమును ధరించినది.

528. **సహస్రదళ పద్మస్థా :** సహస్రదళ పద్మమునందుండును.

529. **సర్వవర్ణోపశోభితా :** నలుపు, ఎరుపు, పసుపు మొదలగు సకల వర్ణములతో ప్రకాశించును.

530. **సర్వాయుధధరా :** సర్వాయుధములను ధరించును.

531. **శుక్ల సంస్థితా :** శుక్లమందు ఉనికి గలది.

532. **సర్వతోముఖీ :** అన్నిదిక్కులందు ముఖములుగలది.

533. **సర్వౌదన ప్రీతచిత్తా :** సమస్త అన్నములందు ప్రీతి చెందిన చిత్తము గలది.

534. **యాకిన్యంబాస్వరూపిణీ :** యాకినీయను దేవీ స్వరూపము గలది.

535. **స్వాహా 536. స్వధా :** దేవతలకు హవిస్సునిచ్చునపుడుపయోగింపబడును.

537. **అమతిః :** జ్ఞానరూపిణి.

538. **మేధా :** బుద్ధి విశేషరూపముగా గలది.

539. **శ్రుతిః :** వేద రూపిణి.

540. **స్మృతిః :** వేదములు, మన్వాదిస్మృతులు ఆమె రూపములు.

541. **అనుత్తమా :** సహజ ఐశ్వర్యము, స్వతంత్ర బుద్ధి కలిగి ఉత్తమమైనది వేరొకటి లేనిది.

542. **పుణ్యకీర్తిః :** పుణ్యమైన కీర్తిగలది.

543. **పుణ్యలభ్యా :** వేదాంతులు, పుణ్యవంతులు, తపోవంతులు దేవిని కాంచగల్గుదురు.

544. **పుణ్యశ్రవణకీర్తనా :** పుణ్యరూపమైన విహిత కర్మలను వినుట, పొగడుట చేయును.

545. **పులోమజార్చితా :** పులోమ పుత్రికయైన ఇంద్రాణి (శచీదేవి) చే పూజింపబడును.

546. **బంధమోచనీ :** అవిద్యా సంబంధమైన బంధములనుండి విడిపించును.

547. **బన్ధురాలకా :** ఆమె కేశములు ఉన్నతమైన అలలను పోలియుండును.

548. **విమర్శరూపిణీ :** ఆత్మజ్ఞాన స్వరూపమైన ప్రకాశమునకు అవసరమైన వాచక

రూపమైన విమర్శ రూపముగా గలది.

549. విద్యా: మోక్షమునొసగు జ్ఞాన స్వరూపమైన విద్యయే దేవి.

550. వియదాది జగత్ప్రసూః: ఆకాశమే ఆదిగా గల జగత్తులను ప్రసవించినది.

551 సర్వవ్యాధి ప్రశమనీ: సమస్తమైన జ్వరాది వ్యాధులకు నాశకారణమైనది.

552. సర్వమృత్యునివారిణీ : అపమృత్యువు, కాలమృత్యువు మొదలగు సర్వమృత్యువులను నివారించును.

553. అగ్రగణ్యా: సకల జగత్తులకు మూల కారణమగుటచే గణములకు లెక్కింపదగినది. మరుద్గణములకు నాయిక.

554. అచింత్యరూపా: చింతించుటకు శక్యము కాని రూపముగలది.

555. కలికల్మషనాశినీ: కలియుగమందలి పాపరాశులన్నియు నశించును.

556. కాత్యాయనీ: శ్రేష్ఠమైన, ఉత్తమమైన సర్వతేజస్సులు కలిగి కాత్యాయనిగా ప్రసిద్ధమైనది.

557. కాలహంత్రీ: మృత్యువునే చంపును.

558. కమలాక్ష నిషేవితా: విష్ణువు ఇంద్రనీలమయమైన దేవినర్చించి విష్ణుత్వమును పొందెను.

559. తాంబూల పూరితముఖీ: తాంబూలముచే పూరితమైన ముఖముగలది.

560. దాడిమీ కుసుమప్రభా: పండ్లు లేక పువ్వులు మాత్రమే గల దాడిమి వృక్ష పుష్పము వంటి కాంతితో ప్రకాశించును.

561. మృగాక్షీ: జింక కన్నుల పోలిన కన్నులు గలది.

562. మోహినీ: అమృతమథన సమయమున విష్ణువు దాల్చిన మోహినీ రూపముగలది.

563. ముఖ్యా: అన్నిటి కంటె ముందు అనగా సత్యము కంటెను ముందు పుట్టినది ముఖ్య.

564. మృడానీ: పరమ సుఖము నొసగు శివుని భార్య.

565. మిత్రరూపిణీ: సూర్యుని రూపముగలది.

566. నిత్యతృప్తా: నిత్యము తృప్తి కలిగి నిత్యమైన స్వరూపానందమునందు తృప్తినొందును.

567. భక్తనిధిః: భక్తుల కోర్కెల తీర్చు నిధి.

568. నియంత్రీ: లోకములను నియమించు మార్గదర్శిని.

569. నిఖిలేశ్వరీ: సకల ప్రపంచములకీశ్వరి.

570. మైత్ర్యాదివాసనాలభ్యా: మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్షయను నాలుగు వాసనలచే పొందదగినది.

571. మహాప్రళయ సాక్షిణీ : శివుడొనర్చు మహాప్రళయమునకు సాక్షిణిగా నుండి అందరు నశించినను ఆమెకు నాశము లేక మిగిలి యుండును.

572. పరాశక్తి:: అన్ని శక్తులకంటె ఉత్కృష్టమైన శక్తియే పరాశక్తి. అట్టి శక్తి స్వరూపిణి.

573. పరానిష్ఠా: పరామంత్ర రూపమైన శక్తి రూపము గలది.

574. ప్రజ్ఞాన ఘన రూపిణీ: స్వల్పమైనను అవిద్యా సంబంధము లేని మహోన్నతమైన నిత్యజ్ఞాన స్వరూపముగలది.

575. మాధ్వీపానాలసా : ద్రాక్షరసము కంటె భిన్నమైన మదిరా పానముచే హృదయమందే చలనము లేనిదై శీతలము గానుండును. అనగా శీతల హృదయము గలది.

576. మత్తా: పరమశివునందున్న పరాహంతా రూపముగలది.

577. మాతృకావర్ణరూపిణీ: మాతృకలైన అకారాది క్షకారాంతములు స్వరూపముగా గలది·మాతృకా వర్ణములే శ్రీచక్రస్వరూపములు. అట్టి మాతృకావర్ణాత్మకమైన శ్రీచక్ర స్వరూపిణి.

578. మహాకైలాసనిలయా : కైలాసము కంటె వేరైన లోకము మహాకైలాసము నిలయముగా గలది.

579. మృణాళ మృదుదోర్లతా : తామర తూడులోని దారముల వలె మృదువైన తీగవంటి భుజముగలది.

580. మహనీయా : పూజ్యార్హురాలు.

581. దయామూర్తి:: దయయే రూపముగా గలది.

582. మహాసామ్రాజ్యశాలినీ: మహాకైలాసాధిపత్యమే మహా సామ్రాజ్యము. అట్టి దానితో ఒప్పను.

583. ఆత్మవిద్యా: అష్టాక్షర మంత్రరూపమైన ఆత్మజ్ఞాన రూపము గలది.

584. మహావిద్యా: నవదుర్గా విద్యకు మహావిద్యాయను పేరు గలదు. అట్టి నవదుర్గా మంత్ర స్వరూపిణి.

585. శ్రీవిద్యా: మోక్ష ఫలమునిచ్చు ఆత్మవిద్యయే దేవి.

586. కామసేవితా : మహాకామేశునిచే సేవింపబడును. ఉపాసింపబడును.

587. శ్రీషోడశాక్షరీ విద్యా: శ్రీతోగూడిన షోడశాక్షరీ విద్యయే శ్రీదేవి.

588. త్రికూటా: 1. బ్రహ్మ, విష్ణు, రుద్రులు 2 జాగ్రత్, స్వప్న, సుషుప్తులు 3. జాలంధరాది పీఠత్రయము 4. భూః భువః స్వర్లోకములు 5. సత్వ, రజో, తమో గుణములు - ఈ మూడు సంఖ్యలు గలవాని కూటమే దేవి.

589. **కామకోటికా:** శివశక్తి సామరస్యమైన పరబ్రహ్మరూపము గలిగి దేవి కామకోటి కయని పూజింపబడుచున్నది.

590. **కటాక్షకింకరీ భూతకమలాకోటి సేవితా:** కటాక్ష మాత్రము చేతనే సేవికలైన కోటి లక్ష్మలచే సేవింపబడుచున్నది.

591. **శిరస్థితా:** శిరస్సునందలి బ్రహ్మరంధ్రము నందు గురురూపముతో నుండును.

592. **చంద్రనిభా:** చంద్రునితో సమానమైన కాంతిగలది.

593. **భాలస్థా:** నొసటియందు హ్రీం కార రూపమున నుండును.

594. **ఇంద్రధనుః ప్రభా:** ఇంద్ర ధనుస్సు వంటి కాంతిగలది.

595. **హృదయస్థా:** హృదయమధ్యమందు ధ్యానింపదగినదిగా నుండును.

596. **రవిప్రఖ్యా:** సూర్యునితో సమానమైన కాంతిగలది.

597. **త్రికోణాంతర దీపికా:** మూలాధార పద్మ కర్ణిక మధ్యలో త్రికోణమందు అగ్నిమయముగా దీపము వలె ప్రకాశించును.

598. **దాక్షాయణీ:** దక్షుని పుత్రిక దాక్షాయణి రూపము గలది.

599. **దైత్యహంత్రీ:** భండాసురాది రాక్షసులను చంపును.

600. **దక్షయజ్ఞవినాశినీ:** దక్షయజ్ఞములను నాశనము చేసిన శీలము గలది.

601. **దరాందోళిత దీర్ఘాక్షీ:** భయమును నశింపజేయు దీర్ఘమైన కన్నులు గలది.

602. **దరహాసోజ్జ్వలన్ముఖీ:** చిరునవ్వుతో ముఖము ప్రకాశించు చుండును.

603. **గురుమూర్తి:** చీకటిని పోగొట్టి వెలుగు చూపు బ్రహ్మజ్ఞానరూపమైన గురుమూర్తి.

604. **గుణనిధిః:** సత్వాది గుణములకు నిధి.

605. **గోమాతా:** ధేనువులకు తల్లియైన కామధేనువు లలితా దేవి.

606. **గుహజన్మభూః:** జీవులకు ఉత్పత్తి స్థానమైనది.

607. **దేవేశీ:** బ్రహ్మవిష్ణ్వాది దేవతలకీశ్వరి.

608. **దండనీతిస్థా:** అన్యాయ మార్గమందు చరించువారిని నీతిశాస్త్రమందు చెప్పబడిన రీతిన దండించును.

609. **దహరాకాశ రూపిణీ:** అల్పమైన హృదయకుహరమందుండు రూపముగలది.

610. **ప్రతి పన్మఖ్యరాకాంత తిథిమండల పూజితా:** పదిహేను తిథులందు పూజింపబడును.

611. **కలాత్మికా:** సకల కలలు రూపము గలది.

612. **కలానాథా:** కలలకు స్వామిని.

613. కావ్యాలాప వినోదినీ : వాల్మీకి మొదలగు కవులు రచించిన కావ్యాలాపనచే సంతసించును.

614. సచామర రమావాణీ సవ్యదక్షిణ సేవితా : లక్ష్మి, సరస్వతులు కుడి, ఎడమవైపుల నిలుచుని వింజామరలు వీచి సేవింతురు.

615. ఆదిశక్తిః : సమస్త జగత్తులను పుట్టించుటచే ఆదికారణ భూతయైన శక్తియైనది.

616. అమేయా : సమస్తమూ దేవియే యగుటచే కొలుచుటకు సాధ్యము కానిదై ఆమెకు సాటియైనది.

617. ఆత్మ: సర్వవ్యాప్తమై నిత్యమైన పరబ్రహ్మరూపమైన ఆత్మయే దేవి.

618. పరమా : పరబ్రహ్మ యొక్క నాలుగు రూపములైన పురుషుడు, వ్యక్తము, అవ్యక్తము, కాలముల కంటె పరమైనదిగాన పరమ.

619. పావనాకృతిః : పవిత్రమైన శరీరము, చరిత్రము, జ్ఞానము కలది.

620. అనేక కోటి బ్రహ్మాండజననీ : అనంతకోటి సంఖ్యలుగల బ్రహ్మాండముల పుట్టించు తల్లి.

621. దివ్యవిగ్రహా : రమణీయ, విస్తార రూపముగలది.

622. క్లీంకారీ : క్లీం అను బీజస్వరూపురాలు.

623. కేవలా : జ్ఞానరూపిణి.

624. గుహ్యా: మిక్కిలి రహస్యార్థముగలది.

625. కైవల్య పదదాయినీ : ఆత్మజ్ఞానముచే పొందదగిన ముక్తి స్థానమునిచ్చును.

626. త్రిపురా : త్రిమూర్తుల కంటె పురాతనమైనది.

627. త్రిజగద్వంద్యా : ముల్లోకములచే నమస్కరింపబడును.

628. త్రిమూర్తిః : ఎరుపు, తెలుపు, మిశ్రాత్మక వర్ణరూపము గలది.

629. త్రిదశేశ్వరీ : దేవతలందరకీశ్వరి.

630. త్ర్యక్షరీ : వాక్, కామ, శక్తి బీజాత్మకములైన మూడక్షరముల రూపముగలది.

631. దివ్యగంధాఢ్యా : హరిచందనాది పరిమళములతో గూడినది.

632. సిందూర తిలకాంచితా : ఎర్రని చూర్ణపు బొట్టుతో గూడి స్త్రీలచే పూజింపబడును.

633. ఉమా : విష్ణు, శివ, బ్రహ్మ వాచకములైన అకార, ఉకార, మకారములతో గూడిన త్రిమూర్త్యాత్మకమైన ప్రణవ రూపిణి.

634. శైలేంద్ర తనయా : పర్వతరాజ పుత్రిక.

635. గౌరీ: హిమవంతుని పుత్రిక మరియు గౌరీయనునది స్వరూపము.

636. గంధర్వ సేవితా: విశ్వావసువు మొదలగు గంధర్వులచే సేవింపబడును.

637. విశ్వగర్భా: విశ్వమును గర్భమునందు ధరించును.

638. స్వర్ణగర్భా: స్వర్ణగర్భము నందు పుట్టినది మరియు ప్రకాశించు మంత్రములు గర్భము నందుగలది.

639. అవరదా: కాంతిగల దంతములు గలది మరియు రాక్షసులను సంహరించునది యనియు చెప్పనగును.

640. వాగధీశ్వరీ: వాక్కులకు అధీశ్వరి.

641. ధ్యానగమ్యా: ధ్యానముచే ఎరుగదగును.

642. అపరిచ్ఛేద్యా: దేశకాలములచే ఎరుగరానిది, ఎల్లలు లేనిది.

643. జ్ఞానదా: బంధజ్ఞానమును పోగొట్టి పరమాత్మ జ్ఞానము నొసగును.

644. జ్ఞానవిగ్రహా: జ్ఞానమే శరీరముగా గలది.

645. సర్వవేదాంత సంవేద్యా: సమస్త ఉపనిషత్తులచే ఎరుగదగినది.

646. సత్యానంద స్వరూపిణీ: సత్యము, ఆనందము స్వరూపముగా గలది.

647. లోపాముద్రార్చితా: అగస్త్యుని భార్యయైన లోపాముద్ర మరియు లోపాముద్ర యను విద్యచే పూజింపబడును.

648. లీలాక్లుప్త బ్రహ్మాండ మండలా: అనాయాసముగా బ్రహ్మాండములనేర్పరచును.

649. అదృశ్యా: బాహ్య ఇంద్రియములకు కనుపించక జ్ఞానముచే గోచరమగునది.

650. దృశ్యరహితా: దృశ్యమైన ప్రాపంచిక వ్యవహార రహితురాలై పారమార్థిక భావముగలది.

651. విజ్ఞాత్రీ: సకలమును తెలిసినది.

652. వేద్యవర్జితా: తెలిసికొనదగిన పదార్థాంతములు పారమార్థికములుగాక పోవుటచే వానిచే వర్జితురాలై సర్వజ్ఞత్వము గలది.

653. యోగినీ: ఐక్యభావము కలిగి ఐక్యభావమునిచ్చును.

654. యోగదా: యోగమునిచ్చునది.

655. యోగ్యా: యోగము (చిత్తవృత్తి నిరోధము) నిచ్చునది.

656. యోగానందా: శివశక్తి సామరస్యముతో గూడిన ఆనందము కలది.

657. యుగంధరా: సకల జగత్తును వహించును.

658. ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి స్వరూపిణీ: ఇచ్ఛ (శరీర ప్రదేశము), జ్ఞానము (క్రింది భాగము), క్రియ (పాదములు) యను శక్తి త్రయ, గుణత్రయ స్వరూపిణి.

659. **సర్వాధారా:** సర్వమూ ఆధారముగా గలది.

660. **సుప్రతిష్ఠా:** లోకములందు మంగళకరముగా ప్రతిష్ఠింపబడినది.

661. **సదసద్రూపధారిణీ:** సత్ ( బ్రహ్మ), అసత్ (జగత్తు) విషయక జ్ఞానరూపము గలది.

662. **అష్టమూర్తిః:** 1. లక్ష్మి 2. మేధ 3. ధర 4. పుష్టి 5. గౌరి 6. తుష్టి 7. ప్రభ 8. ధృతియను ఎనిమిది మూర్తులు గలది.

663. **అజాజైత్రీ:** ఎరుపు, తెలుపు, నలుపు మొదలైన ప్రసిద్ధ అవిద్యారూపముగల అజ అను దానిని జయించునది. అనగా అజ్ఞానమును నశింపజేయు జ్ఞానరూపిణి.

664. **లోకయాత్రా విధాయినీ :** వదం
ప్రళయముగాని సంరక్షణముగ

665. **ఏకాకినీ:** ఆమె ఒంటరిగానే లోక

666. **భూమరూపా:** బ్రహ్మరూపిణియై

667. **నిర్ద్వైతా:** ద్వైతరహితురాలు.

668. **ద్వైతవర్జితా:** ద్వైతభావము అనగా
కాదుగాన ద్వైతమును వర్జించ

669. **అన్నదా:** ఆహారము నిచ్చును.

670. **వసుదా:** దేవిని నమ్ముకొన్న వారి

671. **వృద్ధా:** సర్వజ్యేష్ఠురాలుగాన వి
వృద్ధి పరచును.

672. **బ్రహ్మాత్మైక్య స్వరూపిణీ :** బ్రహ్మాత్మల
ప్రతిపాదింపదగిన హంస మం
రూపముగలది.

673. **బృహతీ:** అన్నిటి కంటె గొప్పదైన

674. **బ్రాహ్మణీ:** బ్రహ్మజ్ఞాన రూపిణి.

675. **బ్రాహ్మీ:** వాగ్రూపిణి.

676. **బ్రహ్మానందా:** బ్రహ్మానందముగల

677. **బలిప్రియా:** పూజో పహారములు

678. **భాషారూపా :** సంస్కృత, ప్రాకృత
భాషలచే నిరూపింపబడును.

679. **బృహత్సేనా:** అపారమైన చతుర

680. **భావాభావ వివర్జితా :** బ్రహ్మచైతన్యమును తెలుపును.

681. **సుఖారాధ్యా:** సులభముగా ఆరాధింపదగినది.

682. **శుభకరీ :** భక్తులకు శుభమును అనగా మోక్షమును కలిగించును.

683. **శోభనాసులభాగతిః:** మోక్షాది పురుషార్థ స్వరూపిణి గాన శోభన. సుఖముగా ఉపాసింపదగినది గాన సులభ. పొందదగిన స్థానము గతి. ఈ దేవియే పొందదగిన గతులలో ఉత్తమ గతి. మోక్షమును పొందుటకు దేవిని ఆరాధించుటయే సులభమార్గము.

684. **రాజరాజేశ్వరీ :** రాజులకు, దేవతలకు, త్రిమూర్తులకు ఈశ్వరి.

685. **రాజ్యదాయినీ :** వైకుంఠ, కైలాసాధిపత్యము నొసగును.

686. **రాజ్యవల్లభా :** రాజ్యములు ప్రియముగా గలది.

687. **రాజత్కృపా :** దయాది గుణములతో ప్రకాశించును.

688. **రాజపీఠనివేశితనిజాశ్రితా :** తన భక్తులను రాజపీఠములందుంచును.

689. **రాజ్యలక్ష్మీ :** రాజ్యాభిమానము గల లక్ష్మి.

690. **కోశనాథా :** పంచకోశములకు (1. అన్నమయ 2. విజ్ఞానమయ 3. మనోమయ 4. ప్రాణమయ 5. ఆనందమయ) స్వామిని.

691. **చతురంగ బలేశ్వరీ :** రథ, గజ, తురగ, పదాతులను నాలుగు విధములైన సైన్యబలములకీశ్వరి.

692. **సామ్రాజ్యదాయినీ :** మోక్షసామ్రాజ్యమునిచ్చు తల్లి.

693. **సత్యసంధా:** సత్యమే వ్రతముగా గలది.

694. **సాగరమేఖలా :** సముద్రములే మొలనూలుగా గల భూమి స్వరూపము గలది.

695. **దీక్షితా:** దీక్షగల దీక్షితులకు అభిన్నమైనది గాన దీక్షిత.

696. **దైత్యశమనీ :** భండాసురాది దైత్యులను నాశనము చేయును.

697. **సర్వలోకవశంకరీ :** సమస్తలోకములను తనవశము చేసుకొనును.

698. **సర్వార్థదాత్రీ:** అన్నిలోకములందును సకల పురుషార్థములను ప్రసాదించును.

699. **సావిత్రీ :** సవితయును సూర్యుని ప్రకాశింపజేయును. భావ శుద్ధ స్వరూపురాలు.

700. **సచ్చిదానంద రూపిణీ :** సత్, చిత్, ఆనంద రూపములు గలది.

701. **దేశకాలాపరిచ్ఛిన్నా :** దేశకాలములామె వలన ఏర్పడుటచే దేశకాల పరిచ్ఛేద్య కాదు.

702. **సర్వగా :** సర్వాంతర్యామిణియై అంతటా అన్ని రూపములందు నిండియున్నది. ఆమెనెరిగిన వాడు ఆమెయందే లీనమగును.

703. **సర్వమోహినీ:** జగత్తులన్నియూ దేవిచే మోహితములగును. దేవిని పూజించిన మోహమువీడి బ్రహ్మైక్యము సిద్ధించును.

704. **సరస్వతీ:** ద్వైతబుద్ధిని నశింపజేసి అద్వైతబుద్ధిని కలిగించి జ్ఞానమిచ్చు సరస్వతీ రూపిణి.

705. **శాస్త్రమయీ:** దేవి సర్వస్వమూ శాస్త్రమయము. తన నిట్టూర్పుచే, అభిమానముచే నాలుగు వేదములను సృజించెను.

706. **గుహాంబా:** హృదయమను గుహలో ఛాయారూపముతో నుండును.

707. **గుహ్యరూపిణీ:** వ్యావహారిక దృష్టికి యోగ్యము కాని అనగా వ్యావహారిక వాసనలేని జ్ఞానమే రూపముగా గలది మరియు గుహ్యోపనిషత్తు నందు చెప్పబడియున్నది.

708. **సర్వోపాధి వినిర్ముక్తా:** ఉపాధులు, వాటి దోషము లేక అద్వైతభావ స్వరూపము గలది.

709. **సదాశివ పతివ్రతా:** శివుడే భర్తయను వ్రతనియమము గలది.

710. **సంప్రదాయేశ్వరీ:** శ్రీవిద్యను గురుముఖముగా భక్తులకు (శిష్యులకు) సంప్రదాయానుసారము ఇచ్చునట్టి ఈశ్వరి.

711. **సాధు:** సముచిత ధర్మములను చెప్పను.

712. **ఈ (య్యైనమః):** నారాయణుని సోదరి మరియు జ్ఞానార్ణవ మందు 'ఈ' యను మంత్రము ప్రకాశించు రక్త వర్ణమని తెలియనగును.

713. **గురుమండలరూపిణీ:** పరమశివుని మొదలు గురువు వరకుండు పరంపర రూపముగాగలది.

714. **కులోత్తీర్ణా:** అతీంద్రియ స్వరూపిణి. (కులము : ఇంద్రియముల సమూహము).

715. **భగారాధ్యా:** భగము - సూర్యమండలము. రవి మండలమందు పాసింపదగినది.

716. **మాయా:** భగవంతుని శక్తి.

717. **మధుమతీ:** మధుమతియను దేవతారూపముగలది పూజాసమయములందు తేనెతోఅర్చించబడును.

718. **మహీ:** ప్రకృతి స్వరూపిణి.

719. **గణాంబా:** ప్రమాథాది గణములకు తల్లి.

720. **గుహ్యకారాధ్యా:** అజ్ఞాత రహస్య స్థలమందు పూజింపదగినది.

721. **కోమలాంగీ:** సుకుమారమైనది.

722. **గురుప్రియా:** మంత్రదీక్షనిచ్చు గురువులందు ప్రేమగలది.

723. స్వతంత్రా: సర్వతంత్రములు రూపముగా గలది.

724. సర్వతంత్రేశీ: సర్వతంత్రములకీశ్వరి.

725. దక్షిణామూర్తి రూపిణీ: దక్షిణామూర్తి రూపమ్ము గలది.

726. సనకాది సమారాధ్యా: సనక సనందాది మహర్షులచే బాగుగా ఆరాధింపబడినది.

727. శివ జ్ఞానప్రదాయినీ: శివజ్ఞానమును ప్రసాదించును.

728. చిత్కలా: చిత్-సచ్చిదానందాత్మయైన బ్రహ్మ, అతని కలతనయందుగలది. సకల జీవుల మనంబులందు నివసించు చిత్కలా రూపిణి.

729. ఆనంద కలికా: ఆనందమయమైన మొగ్గ.

730. ప్రేమరూపా: స్నేహము, భక్తి రూపముగా గలది.

731. ప్రియంకరీ: భక్తులకు ప్రియమును కలిగించును.

732. నామపారాయణప్రీతా: అక్షరములన్నియు దేవి నామములే. ప్రసిద్ధ నామపారాయణముచే ప్రీతిని పొందును.

733. నందివిద్యా: నందికేశ్వరునిచే ఉపాసింపబడిన విద్యాస్వరూపిణి.

734. నటేశ్వరీ: చిదంబర నటరాజును అనుకరించును.

735. మిథ్యాజగదధిష్ఠానా: మిథ్యాభూతమైన జగత్తునకు అధిష్ఠానమైనది. జగత్తునకాధారమైన బ్రహ్మయే ఆమె ప్రాణము.

736. ముక్తిదా: పూజించినమ్మిన వారికి ముక్తినిచ్చును.

737. ముక్తిరూపిణీ: స్వాత్మానందమే మోక్షము. ఆత్మ సాక్షాత్కారము, తత్త్వమసి, అహంబ్రహ్మాస్మియను ఆత్మ తాదాత్మ్యమే ముక్తి, అట్టి ముక్తి స్వరూపముగా గలది.

738. లాస్యప్రియా: నర్తనము ప్రియముగా గలది.

739. లయకరీ: లయమన చిత్తావస్థా విశేషము. తాళముచే నృత్తగీతాదులు సమముగా కూడియుండుట. అట్టి లయమును చేయును.

740. లజ్జా: సర్వభూతములందు లజ్జా రూపముతో నుండును.

741. రంభాదివందితా: రంభ, ఊర్వశి మొదలగు అప్సరాంగనలచే నమస్కరింపబడును.

742. భవదా వసుధావృష్టిః: సంసారారణ్యమును పెంచునదియు, భోగ, మోక్షప్రదానమందు అమృత వర్షమూవంటిది.

743. పాపారణ్యదావానలా: పాపములనెడి అరణ్యములకు దావాగ్ని, చేసిన పాపములకు దేవి పాదస్మరణమే ప్రాయశ్చిత్తము.

744. **దౌర్భాగ్యతూలవాతూలా :** దౌర్భాగ్యమను గడ్డిని దూరముగా తొలగించు గాలివంటిది. అనగా సత్కర్మలను పుట్టించును.

745. **జరాధ్వాంత రవిప్రభా :** ముసలి తనమను చీకటిని నాశనము చేయు సూర్యకాంతి.

746. **భాగ్యాబ్ధి చంద్రికా :** భాగ్యమనెడి సముద్రమునకు వెన్నెలవంటిదై భాగ్యమును పెంపొందించును.

747. **భక్తచిత్తకేకి ఘనాఘనా :** భక్తుల మనంబులను నెమళ్లను మేఘము వంటి స్వరూపముగలదై సంతస పరచును.

748. **రోగ పర్వతదంభోళిః :** రోగములను పర్వతములను వజ్రాయుధము వంటిదై నాశనము చేయును.

749. **మృత్యుదారుకుఠారికా :** మృత్యువను కట్టెను గండ్రగొడ్డలి వలె నరుకును.

750. **మహేశ్వరీ :** గొప్ప మహిమగల ఈశ్వరి.

751. **మహాకాళీ :** మృత్యువును కూడా జయించు గొప్ప మహిమకలది.

752. **మహాగ్రాసా :** అమితాహారముగలది.

753. **మహాశనా :** గొప్పదైన చరాచర రూపమైన విశ్వమును ఆహారముగా గలది.

754. **అపర్ణా :** తినుటకు ఆకులు కూడా లేనిది. తపస్సుచేయునపుడు పార్వతి ఆకులు కూడా తిననందున నిరాహార పార్వతియని చెప్పనగును.

755. **చండికా :** దుర్మార్గులయెడ క్రోధమును ప్రదర్శించును.

756. **చండముండాసురని షూదనీ :** చండ, ముండులను రాక్షసులను చంపినది.

757. **క్షరాక్షరాత్మికా :** ఏకాక్షరము, అనేకాక్షరములు ఆకారముగా గలది.

758. **సర్వలోకేశీ :** సమస్త లోకములకీశ్వరి.

759. **విశ్వధారిణీ :** విశ్వమును ధరించును.

760. **త్రివర్గదాత్రీ :** ధర్మార్థకామములను త్రివర్గములనిచ్చును.

761. **సుభగా :** సకల సౌభాగ్యములు దేవీ రూపములే.

762. **త్ర్యంబకా :** సూర్య, చంద్రాగ్నులు ఆమె మూడు నేత్రములు బ్రహ్మ, విష్ణు, రుద్రులకు తల్లి.

763. **త్రిగుణాత్మికా :** సత్త్వ, రజో, తమో గుణములు దేవి రూపమే.

764. **స్వర్గాపవర్గదా :** క్షయశీలమైన సుఖము స్వర్గము. నిత్యసుఖము అపవర్గము (మోక్షము) రెంటి సుఖములనిచ్చును.

765. **శుద్ధా :** అవిద్యా సంబంధమైన మలినములు లేనిదై పవిత్రము, పరిశుద్ధమైనది.

766. **జపాపుష్పనిభాకృతిః :** దాసాని పూవుతో సాటియైన ఆకారము గలది.

767. ఓజోవతీ : తేజస్సుగలది.

768. ద్యుతిధరా : కాంతిని ధరించునది.

769. యజ్ఞరూపా : యజ్ఞమే విష్ణువని శ్రుతి చెప్పుటచే విష్ణువు కంటె వేరుగాని యజ్ఞరూపయగుచున్నది. మరియు ఆత్మారాధనయు యజ్ఞము కంటె వేరుగాకపోవుటచే ఆ స్వరూపమున నుండును. అనగా దేవి నారాధిచుటయే.

770. ప్రియవ్రతా : అన్ని వ్రతములు ప్రియముగా గలది.

771. దురారాధ్యా : చపలమైన ఇంద్రియములు గలవారికి ఆరాధించుటకు శక్యము కానిది.

772. దురాధర్షా : అంతేగాక చపలచిత్తులను అనుగ్రహింపదు.

773. పాటలీ కుసుమప్రియా : ఎరుపు, తెలుపు రంగుగల పాటలీ పుష్పమునందు ప్రీతి గలది.

774. మహతీ : నారదుని వీణయైన మహతిరూపము గలదై మహనీయురాలు, పూజనీయురాలగుచున్నది.

775. మేరునిలయా : మేరు పర్వతమే నివాస స్థానముగా గలది. మరియు జ్ఞానార్ణవమందు ఉద్ధరింపబడిన తొమ్మిది వర్ణములైన భూ, చంద్ర, శివ, మాయ, శక్తి, కృష్ణ, ఆధ్వ మాదన, అర్ధ చంద్ర, బిందువుల నవాక్షర మంత్రమునకు నిలయమైనది. సర్వ మంత్రములకు పుట్టుక స్థానము.

776. మందార కుసుమ ప్రియా : దేవతరువైన మందార పుష్పము నందు ప్రీతి గలది.

777. వీరారాధ్యా : వీరులన ఆత్మానందముననుభవించు వారు, బాధలను తొలగించువారు, అహంభావ ద్వైతభావములను తొలగించిన వారు, అనాత్మభావరహితులు, ధైర్యవంతులు-వీరిచే పూజింపబడును.

778. విరాడ్రూపా : విరాట్ స్వరూపముగలది, విశ్వరూపిణి, సచ్చిదానంద రూపిణి.

779. విరజా : పాపరహితురాలు. ఉత్కల దేశమందలి విరజాక్షేత్రమందు బ్రహ్మచే విరజామాతగా ప్రతిష్ఠింపబడినది.

780. విశ్వతోముఖీ : విశ్వవ్యాప్తమైన రూపము గలదై నిర్గుణురాలై ఏదిక్కున ధ్యానించినను వారికాదిశయందు కన్పించును.

781. ప్రత్యగ్రూపా : అంతర్ముఖియై దేవిస్వరూపము అంతరాత్మయందే చూడదగినది.

782. పరాకాశా : సాటిలేని బ్రహ్మరూపము గలది.

783. ప్రాణదా : ప్రాణములనిచ్చునది. దేవిని ప్రాణస్వరూపముగా, పరబ్రహ్మ స్వరూపముగా ఉపాసింపవలెను.

784. **ప్రాణరూపిణి :** బ్రహ్మరూపిణి.

785. **మార్తాండభైరవారాధ్యా:** సూర్యుని వంటి భైరవ యత్నముతో దేవిని ఆరాధించిన ప్రసన్నమై ప్రత్యక్షమగును.

786. **మంత్రిణీన్యస్తరాజ్యధూః:** శ్యామలాంబయందుంచబడిన రాజ్య భారముగలది.

787. **త్రిపురేశీ:** సర్వాశా పరిపూరక చక్రాధీశ్వరి త్రిపురేశి. ఆమెతో భేదము లేనిది.

788. **జయత్సేనా:** జయత్సేనుడను రాజ స్వరూపము గలిగి భండాసురాదులను జయించు శక్తి సేనల సమూహమును కలిగి యున్నది.

789. **నిస్త్రైగుణ్యా:** త్రిగుణ రహితమైనది.

790. **పరాపరా :** పరాపర స్వరూపము గలది. పర-శ్వేత వర్ణము కలిగి త్రిమూర్తులనారంభించి సృష్టించు శక్తి. అపర-ఎర్రని రంగుగల విశాలాక్షి పరాపర-రౌద్రీ శక్తి. రుద్రుని వాస్తవముగా నెరిగినవాడు త్రివిధ శక్తులను పొందును.

791. **సత్యజ్ఞానానందరూపా :** సత్యము, జ్ఞానము, ఆనందము దేవి రూపములు. సత్యము, జ్ఞానము అనంతబ్రహ్మయనియు, విజ్ఞానము, ఆనందము బ్రహ్మయనియు శ్రుతులందు చెప్పబడినది.

792. **సామరస్య పరాయణా :** న్యూనాధిక్యములు లేని శివశక్తి సామరస్యమే పరాయణము అనగా ఆశ్రయముగా గలది. సామయనరసరమ్యగీతములు. సామవేదగానములందాసక్తి గలది.

793. **కపర్దినీ:** శివక్షేత్రములలో భగళాండ క్షేత్రమున కపర్దియను పేరుతో వెలసిన శివుని భార్య.

794. **కలామాలా :** అరువది నాలుగు కలల పరంపరతో లావణ్యమును, శోభను పొందియున్నది.

795. **కామధుక్:** కామధేనువై మనోరథములనీడేర్చును.

796. **కామరూపిణీ :** పరమశివుని రూపముగలది.

797. **కలానిధిః :** కలాస్వరూపిణి, చంద్రమండలరూపిణి. బృహదారణ్యకమందు పదునారవకల ఆత్మయని చెప్పబడుటచే జీవులకు నిధి. అనగా కర్మఫలములను తనలో ఇముడ్చుకొను జ్ఞాన స్వరూపిణి.

798. **కావ్యకలా :** కవి యొక్క కర్మ కావ్యము. కావ్యము దృశ్య, శ్రవ్య భేదములచే అనేక విధములైన కలలతో ఒప్పును. ఆకలలన్నియూ దేవి రూపములే. దేవిని స్మరించుటచే కావ్యములను నిర్మించు ప్రతిభ అనగా కావ్యకల కలుగును.

799. **రసజ్ఞా:** రసములన్నియూ ఎరిగినది.

800. **రసశేవధిః :** రసమే వీర్యము, పరబ్రహ్మ, పరాగతి, ప్రాణము. పురుషులకు కాంతినిచ్చును. బ్రహ్మామృతమునకు నిధి.

801. పుష్టా : ముప్పదియారుతత్త్వములతో గూడిన శరీరముగలది. అనేక గుణములచే, బ్రహ్మరసముచే, బ్రాహ్మణులచే పుష్టినొందినది.

802. పురాతనా: అన్నిటికి ఆదియై పురాతన గుణములు కలిగియున్నది.

803. పూజ్యా: అందరిచే పూజింపబడునది.

804. పుష్కరా: పుష్కరమను తీర్థ స్వరూపమై అంతటా వ్యాపించియున్నది.

805. పుష్కరేక్షణా: కమలము వంటి కన్నులు గలది. నాలుగు జలములైన దేవతలు, మనుష్యులు, పితరులు, రాక్షసులయందు చూపు కలిగి యుండును. (పుష్కరము - కమలము, నీరు).

806. పరంజ్యోతిః: ఆత్మజ్యోతి స్వరూపిణి, పరంజ్యోతి, మంత్ర స్వరూపిణి.

807. పరంధామ: ఉత్కృష్టమైన తేజస్సు కలది.

808. పరమాణుః : పరమమైన అణురూపిణియై తెలుసుకొనుటకు అసాధ్యమై యున్నది. శ్రేష్ఠమైన మంత్రస్వరూపము గలది. (పరమ - ఉత్కృష్టమైన, అణు-మంత్రము).

809. పరాత్పరా: పరముల కంటె పరమయై పరులైన బ్రహ్మ, విష్ణు, రుద్రుల కంటె శ్రేష్ఠతరురాలైనది.

810. పాశహస్తా: ఎడమ భాగమున క్రిందచేతి యందు పాశమును ధరించి పాశములను తొలగించి ముక్తినిచ్చును.

811. పాశహంత్రీ: తన హస్తములతో భక్తుల పాశములను తొలగించును.

812. పరమంత్ర విభేదినీ : తనను భక్తితో జపించువారి పాపములను నశింపజేయును.

813, 814. మూర్తా, అమూర్తా : రూపము కలిగిన పృథ్వి, అగ్న్యాదులు మూర్తము. వాయువు, ఆకాశము మొదలైన రూపము లేనివి అమూర్తములు. బ్రహ్మకు ఈ రెండు రూపములు గలవు. క్షర, అక్షర స్వరూపముగ దేవి అన్ని భూతములందుండును.

815. అనిత్యతృప్తా: భక్తితో ఏది సమర్పించినను తృప్తిపడును.

816. ముని మానసహంసికా : మహర్షుల మనస్సను మానస సరోవరమునందు నివసించు ఆడుహంస.

817. సత్యవ్రతా: సత్యము - బ్రహ్మము. బ్రహ్మవ్రతమే ప్రియముగా గలది. సత్యము పలుకుట అనువ్రతముచే దేవి కటాక్షించును.

818. సత్యరూపా: సత్యమే రూపముగా గలది.

819. సర్వాంతర్యామిణీ: అన్నిటిని సృజించి అన్నిటియందు వ్యాపించియుండును.

820. సతీ: పాతివ్రత్యము సద్రూపముగా గలది.

821. **బ్రహ్మాణీ:** బ్రహ్మను జీవింపజేయును.

822. **బ్రహ్మాణి:** ద్వైత భావమును తొలగించు బ్రహ్మజ్ఞాన స్వరూపిణి.

823. **జననీ:** సకల ప్రపంచమును పుట్టించును.

824. **బహురూపా:** భండాసురుని చంపుట మొదలగు క్రియలు అనేకమైనవి కలవియగుటచే బహురూపయగుచున్నది.

825. **బుధార్చితా:** జ్ఞానులచే పూజింపబడును.

826. **ప్రసవిత్రీ:** ఆకాశము మొదలు ప్రపంచమును, ప్రజలను గొప్పగా జనింప జేయుచున్నది.

827. **ప్రచండా:** పరాక్రమశీలయైయున్నది.

828. **ఆజ్ఞా:** విధినిషేధముల ఆజ్ఞారూపముగలది.

829. **ప్రతిష్ఠా:** సకల విశ్వమునకాధారభూతురాలు.

830. **ప్రకటాకృతిః:** అందరిచే తెలుసుకోదగిన రూపముగలది.

831. **ప్రాణేశ్వరీ:** ప్రాణములను, ఇంద్రియములను అధిష్ఠించియుండు ఈశ్వరి. వేదార్థముచే ప్రతిపాదింపబడు దేవత.

832. **ప్రాణదాత్రీ:** ప్రాణములనిచ్చును. సర్వజగత్తులను జీవింపజేయును.

833. **పంచాశత్పీఠరూపిణీ:** ఏబది పీఠముల రూపముగలది.

834. **విశృంఖలా:** సంకెళ్లవంటి కర్మాది నిర్బంధములు లేనిది.

835. **వివిక్తస్థా:** పవిత్ర స్థలములందు అనగా ఆత్మానాత్మ వివేకశీలుర యందుండును. (వివిక్తము : జనులు లేని పవిత్రదేశము)

836. **వీరమాతా:** వీరులకు తల్లియై మేలు చేయును.

837. **వియత్ప్రసూః:** ఆకాశము అనగా పరమాత్మ ఆకాశమును ప్రసవించినది.

838. **ముకుందా:** ముక్తినొసగును.

839. **ముక్తినిలయా:** మోక్షములకు స్థానము.

840. **మూల విగ్రహ రూపిణీ:** బాలబగళ మొదలగు శక్తులకు మూల భూతయైన రాజరాజేశ్వరీ విగ్రహమే రూపముగా గలది.

841. **భావజ్ఞా:** భావములనెరుగును.

842. **భవరోగఘ్నీ:** సంసారమనెడి రోగమును నాశము చేయును.

843. **భవచక్రప్రవర్తినీ:** సంసార చక్రమును త్రిప్పును- మరియు భవుని చక్రమును అనగా మనస్సును ప్రవర్తింప జేయును. (ఇక్కడ చక్రము - మనస్సు).

844. **ఛందస్సారా:** ఛందస్సన వేదము. వేదసార స్వరూపిణి గాయత్రీ స్వరూపము

గలది. గాయత్రీ ఛందస్సు రూపము గలది. అద్వైత సిద్ధిని పొందిన మనస్సు అనుభవించు ఆనందమే దేవి.

845. శాస్త్రసారా: వేదసార భూతమైనది. ధర్మాధర్మములను, ప్రవృత్తి, నివృత్తులను తెలియజేయు మీమాంసాది శాస్త్రసారము.

846. మంత్రసారా: వేదములను, తంత్ర శాస్త్రోక్త మంత్రములను ప్రతిపాదించు అరువది నాలుగు తంత్రముల సారము.

847. తలోదరీ: హస్తతలము వలె కృశించిన ఉదరము గలది.

848. ఉదార కీర్తిః: అంతటా వ్యాపించిన అమృతప్రాదము వలె ఉత్కృష్టమైన కీర్తిగలది. దేవినుపాసించువారు విశ్వవ్యాప్తి కీర్తిని పొందుదురు.

849. ఉద్దామవైభవా: దామమన కొలత జేయుబంధించుత్రాడు. దానిని మించిన అత్యంతవైభవముగలది.

850. వర్ణరూపిణీ: అరువది నాలుగు వర్ణముల రూపము గలది.

851. **జన్మమృత్యుజరాతప్తజన విశ్రాంతిదాయినీ:** పుట్టుక, మరణము, ముదుసలి తనములచే తపించు జనుల దుఃఖమును తొలగించి ఆత్మసుఖమునిచ్చును.

852. సర్వోపనిషదుద్ఘుష్టా: సమస్త ఉపనిషత్తులు, ఉచ్చైస్స్వనములు. దేవినే తెలుపుచు ప్రతిపాదించుచున్నవి.

853. శాంత్యతీత కలాత్మికా: ఆకాశమందుండి శాంత్యతీతకల ద్వైతభావమును తొలగించి ఆనందమును బోధించును. కావున దేవియు అట్టి ఆనందమునొసగును.

854. గంభీరా: దేవి అనంత, మహోప్రాదస్వరూపురాలు. అనగా పరాశక్తి. తన ఇచ్ఛా శక్తితో విశ్వమును సృజించి; కాపాడి, గంభీరురాలై, దేశకాలాతీతయై ప్రకాశించుచుండును.

855. గగనాంతస్థా: సర్వప్రళయమందును దేవియుండును.

856. గర్వితా: గర్వమన విశ్వమును నిర్మించునట్టి పరాహంత. అట్టి పరాహంత ఈమెయందు పుట్టినది.

857. గానలోలుపా: తతము, ఆనద్ధము, సుషిరమ, ఘనము అను నాలుగు విధముల కలయికతో గూడిన గానమందాసక్తిగలది.

858. కల్పనారహితా: లౌకికమైన కల్పనలు లేనిది.

859. కాష్ఠా: వేదాంత వాక్యములచే నిరూపింపబడిన తత్త్వము.

860. అకాంతా: అకమును (పాపము, దుఃఖము) నశింపజేయును.

861. కాంతార్ధ విగ్రహా: శివుని అర్ధశరీరమును ధరించినది.

862. **కార్యకారణ నిర్ముక్తా :** కార్యములు (మహత్త్వాదులు), కారణములు (మూలప్రకృతి) లేనిది.

863. **కామకేళితరంగితా :** కామేశ్వరునియందు అనురక్తయైయుండును.

864. **కనత్కనక తాటంకా :** ప్రకాశించు బంగరు కమ్మెలు దేవి కర్ణాభరణములుగా గలది.

865. **లీలావిగ్రహ ధారిణీ :** అనాయసముగ అవతార విశేషములను ధరించును.

866. **అజా :** పుట్టుకలేనిది.

867. **క్షయవినిర్ముక్తా :** జననమరణములు లేనిది.

868. **ముగ్ధా :** అపురూప సౌందర్యవతి· ఆమెను సేవించువారు మూఢులు గాక జ్ఞానులగుదురు.

869. **క్షిప్రప్రసాదినీ :** శీఘ్రముగ అనుగ్రహించును.

870. **అంతర్ముఖ సమారాధ్యా :** ఆత్మాభిముఖమైన చిత్తవృత్తిగల వారిచే బాగుగా ఆరాధింపబడును.

871. **బహిర్ముఖ సుదుర్లభా :** బాహ్య విషయాభి ముఖమైన చిత్తవృత్తిగల వారికి అనగా చంచలాత్ములకు పొందరానిది.

872. **త్రయీ :** ఋగ్, యజు, సామవేదత్రయీ రూపము గలది.

873. **త్రివర్గనిలయా :** ధర్మార్థ కామములందు, త్రికాలములందు, అకార, ఉకార, మకారములందు స్థానము గలది.

874. **త్రిస్థా :** ముల్లోకములు, ముగ్గురు దేవతలు, మూడు విద్యలు, మూడగ్నులు, మూడుజ్యోతిస్సులు, త్రికాలములు, మూడు ఆశ్రమములు మొదలగు త్రయములన్నియూ దేవి రూపములే.

875. **త్రిపుర మాలినీ :** అంతర్ద శార చక్రమందు అభిమానముగలది.

876. **నిరామయా :** నశించిన వ్యాధులుగలది.

877. **నిరాలంబా :** సర్వమునకు ఆలంబయగుటచే వేరు ఆలంబము లేదు.

878. **స్వాత్మారామా :** స్వ-దేవికి సంబంధించిన విశ్వము, ఆత్మ-బ్రహ్మ, ఆరామ-క్రీడనము. విశ్వబ్రహ్మలందు విహరణ వృత్తిగలది. అనగా కాష్ఠమందు నిప్పువలె, భూమియందు పరమాణువుల వలె దేవియందు బ్రహ్మ, జగత్తులు, సమస్తము ఉన్నవి.

879. **సుధాస్రుతిః :** చంద్రమండలము నుండి స్రవించు అమృత ప్రవాహరూపము గలది.

880. **సంసార పంకనిర్మగ్న సముద్ధరణ పండితా :** సంసారమనెడి బురదయందు మునిగిన వారిని పండితురాలై బాగుగా ఉద్ధరించును.

881. యజ్ఞప్రియా : విష్ణుస్వరూపమైన యజ్ఞమందు ప్రీతి గలది.

882. యజ్ఞకర్త్రీ: యజ్ఞము నొనర్చునది.

883. యజమాన స్వరూపిణీ : శివుని ఎనిమిదవ మూర్తియైన ఆత్మయే యజమానమూర్తి. అదియే తన రూపముగా గలది. మరియు యజమాని భార్య దీక్ష అట్టి దీక్షాస్వరూపిణి.

884. ధర్మాధారా : ధర్మము ఆధారముగా గలదియై అన్నిటికి ధర్మము ఆధారముగా ఆమెచే చేయబడినది.

885. ధనాధ్యక్షా: ధనమునకు స్వామిని, కుబేర రూపము గలది.

886. ధనధాన్యవివర్ధినీ : ధన ధాన్యములను వృద్ధి పరచును.

887. విప్రప్రియా : వేద, శాస్త్ర విద్యలనెరిగిన బ్రహ్మణులు విప్రులు. వారి యందు ప్రీతిగలది.

888. విప్రరూపా: విప్ర రూపము కలిగి యుండును.

889. విశ్వభ్రమణ కారిణీ: విశ్వ-విష్ణువు, విష్ణువునకు భ్రమణమును కలుగజేయును.

890. విశ్వగ్రాసా: చరాచరప్రపంచమును మ్రింగును అనగా సంహరించును.

891. విద్రుమాభా: జ్ఞానవృక్షముతో సాటియైనది.

892. వైష్ణవీ: విష్ణువునకు సంబంధించినది.

893. విష్ణురూపిణీ : విష్ణు రూపముగలది. ఆమెను సేవించిన విష్ణులోకము ప్రాప్తమగును.

894. అయోనిః: విష్ణువునకు తల్లి.

895. యోనినిలయా: లోకములన్నియూ దేవియందు లీనమగును.

896. కూటస్థా: అజ్ఞానమునకున్నూ దేవియే స్థానమైనది.

897. కులరూపిణీ: బాహ్య పూజ, వంశాచార రూపముగలది.

898. వీరగోష్ఠిప్రియా: వీరుల సభయందు ప్రీతి గలది.

899. వీరా: వీర్యము గలది.

900. నైష్కర్మ్యా: కర్మలు లేనిది.

901. నాదరూపిణీ: ప్రణవము మీదనున్న నాదమే స్వరూపముగా గలది. అనగా నాదమే పరమేశ్వరీ రూపము.

902. విజ్ఞాన కలనా: విజ్ఞానము కలది.

903. కల్యా: కలలయందు నేర్పరి.

904. విదగ్ధా: నైపుణ్యము గలది.

905. బైందవాసనా: బిందువుల సమూహము ఆసనముగా గలది.

906. తత్త్వాధికా: నశించు తత్త్వములకంటె అధికురాలు.

907. తత్త్వమయీ: ఆత్మతత్త్వ, విద్యాతత్త్వ, శివతత్త్వములను మీరిన సచ్చిదానంద రూపము గలది. సకలతత్త్వములు దేవి అవయవములుగా భావించబడును.

908. తత్త్వమర్థస్వరూపిణీ: శివజీవ స్వరూపిణి (తత్:శివుడు, త్వం:జీవుడు).

909. సామగానప్రియా: సామగానమందు ప్రీతిగలది.

910. సౌమ్యా: సోమయాగమునలకరించునది, చంద్రుడు, కర్పూరము వలె ఆహ్లాదకరురాలు.

911. సదాశివ కుటుంబినీ: సదాశివునికి శ్యామలయను పేరుతో భార్యయైనది.

912. సవ్యాపసవ్యమార్గస్థా: సవ్య-కుడి భాగము, అపసవ్య-ఎడమ భాగము, మార్గ-మధ్యభాగము, సూర్యమండలమునకు దేవి సవ్యాప సవ్యమార్గములందుండి పాలించును.

913. సర్వాపద్వినివారిణీ: దేవిని నమ్మిన వారికి సర్వాపదలు తొలగును.

914. స్వస్థా: నిశ్చల చిత్తము గలది.

915. స్వభావమధురా: మధురలో మీనాక్షిగా నివసించును. భక్తుల హృదయమందుండి వారి భక్తికి సంతసించివారికి సత్ఫలములనొసగును.

916. ధీరా: పండితురాలు, ధైర్యవతి, అద్వైత బుద్ధినిచ్చును.

917. ధీర సమర్చితా: పండితులచే జ్ఞానము కంటె వేరుగాని ఆనందము కొరకై పూజింపబడును.

918. చైతన్యార్ఘ్య సమారాధ్యా: ఆత్మజ్ఞానముతో ఆత్మనే అర్ఘ్యముగా సమర్పించి పూజింపవలెను (చైతన్యము : ఆత్మ, అర్ఘ్యము : జ్ఞానము).

919. చైతన్య కుసుమప్రియా: చైతన్య పుష్పము ప్రీతిగా గలది.

920. సదోదితా: నిత్య స్వప్రకాశము గలదియై సజ్జనుల యందు ఉదయించును.

921. సదాతుష్టా: ఎల్లప్పుడు సంతుష్టి కలిగి సజ్జనులయందు ప్రీతి కలిగి యుండును.

922. తరుణాదిత్యపాటలా: మధ్యాహ్నకాలమందలి సూర్యుని ఎరుపు, తెలుపు రంగు గలది.

923. దక్షిణా దక్షిణారాధ్యా: కర్మిష్ఠుల చేతను, జ్ఞానుల చేతను ఆరాధింపదగినది.

924. దరస్మేర ముఖాంబుజా: భక్తుల నాదరించుటలో చిరునగవుతో ప్రసన్నమైన ముఖ పద్మము గలది.

925. కౌలినీ కేవలా: కాల స్వరూపిణి. సుఖదుఃఖ రహితురాలై కేవలమను ఈశ్వర జ్ఞానము గలది.

926 అపవర్గ కైవల్య పదదాయినీ : అనంతకైవల్యమును, అమూల్య స్వస్థానమును భక్తులకిచ్చును.

927 స్తోత్రప్రియా : వైదికస్తుతులు ప్రియముగా గలది.

928. స్తుతిమతీ : స్తుతికి ప్రసన్నురాలై ఐశ్వర్యమును, జ్ఞానమునిచ్చును.

929. శ్రుతి సంస్తుత వైభవా : శ్రుతులచే లెస్సగా పొగడబడిన వైభవము గలది.

930 మనస్వినీ : మనస్సు పరాధీన వృత్తిగాక దేవియందు ఆసక్తి కలిగి స్వతంత్రముగా అధివసించియుండును.

931. మానవతీ : చిత్తౌన్నత్యము కలది.

932. మహేశీ : మహేశ్వరుని భార్య.

933. మంగళాకృతిః : మంగళకరమైన ఆకారము గలది.

934. విశ్వమాతా : జగత్తుకు, విష్ణువునకు తల్లి.

935. జగద్ధాత్రీ : భూరూపముచే జగత్తును ధరించి పాలించును.

936. విశాలాక్షీ : విస్తీర్ణమైన కన్నులు గలిగి వారణాసి యందు విశాలాక్షిగా వెలసియున్నది.

937. విరాగిణీ : వైరాగ్యము గలది.

938. ప్రగల్భా : సృష్ట్యాదులైన పనులందు నేర్పుగలది.

939. పరమోదారా : ఉత్కృష్టమైన గొప్ప దనము గలదై సంసార దుఃఖములను తొలగించి ఆనందమునిచ్చును.

940 పరామోదా : ఉత్కృష్టమైన కీర్తి గలది.

941. మనోమయీ : శుద్ధ బ్రహ్మకు స్థానమైన మనస్సును కలిగి యుండటచే మనోమయీయని పిలువబడుచున్నది.

942 వ్యోమకేశీ : విరాడ్రూప ధారిణియైన దేవికి ఆకాశమే కేశములు మరియు ఆకాశరూపుడు, వ్యోమకేశుడైన శివుని భార్య.

943 విమానస్థా : వేదములందు ప్రతిపాదింపబడి అపరిచ్ఛిన్నమైన బ్రహ్మయందుండు బ్రహ్మరూపిణి.

944. వజ్రిణీ : వజ్రాయుధమును ధరించినదియు, వజ్రభూషణములతో అలంకరింపబడియున్నదై యున్నది. మరియు కఠోపనిషత్తునందు వజ్రశబ్దము బ్రహ్మపరమని చెప్పబడియుండుటచే బ్రహ్మ స్వరూపిణి.

945 వామకేశ్వరీ : వామకేశ్వర తంత్ర స్వరూపురాలు. జగత్తులను సృజించు దక్షాదులకీశ్వరి.

946. పంచయజ్ఞప్రియా : 1. అగ్నిహోత్ర 2 దర్శపూర్ణమాస 3. చాతుర్మాస్య 4. పశు 5. సోమ అనునవి యజ్ఞములందును, విస్తారమైన యజ్ఞమందు ప్రీతి గలది.

947. **పంచప్రేత మంచాధిశాయినీ :** బ్రహ్మ, విష్ణు, రుద్రేశ్వరులు కాళ్లగాను, మహేశ్వరుడు దిండుగాను, సదాశివుడు పలకగాను గల శివాత్మకమైన మంచయందు మహేశ్వరి త్రిపురాసుందరిగా శయనించును.

948. **పంచమీ :** కైవల్యమను పంచమీ ముక్తి స్వరూపముగలది.

949. **పంచభూతేశీ :** పృథివ్యాది పంచభూతములకీశ్వరి.

950. **పంచ సంఖ్యోపచారిణీ :** గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్యములను ఐదు ఉపచారములచే పూజింపబడును.

951. **శాశ్వతీ :** నిత్యురాలు.

952. **శాశ్వతైశ్వర్యా :** నిత్య ఐశ్వర్యము గలది.

953. **శర్మదా :** సుఖమునిచ్చును.

954. **శంభుమోహినీ :** ఆనందస్వరూపుడగు శివునకు ప్రియమైనది.

955. **ధరా :** పృథ్వీ రూపము కలిగి సమస్త జగత్తులను ధరించును.

956. **ధరసుతా :** హిమవంతుని పుత్రిక (ధరుడు : హిమవంతుడు).

957. **ధన్యా :** ధ్యాన రూపము కలిగిన కృతార్థురాలు.

958. **ధర్మిణీ :** ధర్మశీలము గలది.

959. **ధర్మవర్ధినీ :** ధర్మమును వృద్ధిపరచును.

960. **లోకాతీతా :** ఇంద్రలోకము మొదలు విష్ణులోకాంతములను దాటి మహాకైలాసమను పరశివుని పురమందుండును.

961. **గుణాతీతా :** గుణములను మించినది.

962. **సర్వాతీతా :** అన్నిటిని మించిన ఆత్మస్వరూపముగలది.

963. **శమాత్మికా :** ప్రపంచోపశమమే స్వరూపముగా గలది.

964. **బంధూక కుసుమ ప్రఖ్యా :** వంగ దేశమందు ప్రసిద్ధమైన బంధుజీవకమను మహావృక్షము యొక్క పుష్పకాంతిగలది. అనగా మిక్కిలి ఎర్రనికాంతి గలది.

965. **బాలా :** బాల లీలలు గలది.

966. **లీలావినోదినీ :** ప్రపంచ సంబంధమైన క్రీడయే వినోదముగా గలది.

967. **సుమంగలీ :** అశుభములను తొలగించి శుభములను కలిగించును.

968. **సుఖకరీ :** సుఖమును కలిగించును.

969. **సువేషాఢ్యా :** శోభనమైన వేషముతో కూడియున్నది.

970. **సువాసినీ :** సువాసినీ స్త్రీలతో వేరుగాక సర్వకాలము జీవించు భర్త కలిగిన సువాసినీ స్త్రీమూర్తి.

971. **సువాసిన్యర్చన ప్రీతా :** సువాసినీస్త్రీల అర్చనచే ప్రీతిచెందును.

972. **ఆశోభనా :** సర్వసౌందర్యమూర్తి.

973. **శుద్ధమానసా :** పవిత్రమనస్సును కలిగియున్నది.

974. **బిందుతర్పణ సంతుష్టా :** బ్రహ్మణులు క్షీరముచే, క్షత్రియులు అజ్యముచే, వైశ్యులు తేనెచే, శూద్రులు ఆసవముచే చేయు తర్పణముచే సంతసించును. మరియు జ్ఞానులు చేయు తర్పణముచే సంతసించును.

975. **పూర్వజా :** ప్రథమ సృష్టి రూపముగలది.

976. **త్రిపురాంబికా :** అష్టచక్రాభిమాని యైన దేవి రూపము త్రిపురాంబిక. పురత్రయమున క్రీడించు జీవునకు తల్లి.

977. **దశముద్రా సమారాధ్యా :** దశముద్రలతో బాగుగా ఆరాధింపబడును.

978. **త్రిపురాశ్రీవశంకరీ :** పంచమ చక్రమునకు అధిష్ఠాన దేవియైన త్రిపురాశ్రీని వశము చేసుకొనును.

979. **జ్ఞానముద్రా :** తర్జనీ అంగుష్ఠములచేరికయైన జ్ఞానముద్రా రూపము కలిగి యుండి చిదానందములచే ఆవరింపబడియుండును.

980. **జ్ఞానగమ్యా :** జ్ఞానదృష్టిచే తెలిసి కొనదగియుండును.

981. **జ్ఞాన జ్ఞేయస్వరూపిణీ :** జ్ఞానముచే తెలియందగిన దృక్, దృశ్యములు స్వరూపముగా కలిగి యుండును.

982. **యోని ముద్రా :** నవముద్రా రూపముగలది- మంత్రదోషమును తొలగించు రూపముగలది.

983. **త్రిఖండేశీ :** సోమ, సూర్య, అగ్ని మంత్రఖండములకీశ్వరి.

984. **త్రిగుణా :** ఉత్పత్తి, స్థితి, లయము, సత్త్వ, రజో, తమో గుణములు మొదలగు త్రిగుణములు గలది.

985. **అంబా :** సకల జగత్తులకు తల్లి.

986. **త్రికోణగా :** యోని చక్రమునకు పొందినది.

987. **అనఘా :** దుఃఖవ్యసన పాపములు లేనిది.

988. **అద్భుత చారిత్రా :** ఆశ్చర్యకరమైన చరిత్రలు కలిగి దుష్టఫలముల నుండి రక్షించును.

989. **వాంఛితార్థ ప్రదాయినీ :** కోరిన కోరికలనిచ్చును.

990. **అభ్యాసాతిశయ జ్ఞాత్రీ :** ఆమె అవయవములు జ్ఞానము గాను, శరీరము శాస్త్రముగాను, స్థానము హృదయముగాను కలిగి యున్నది. నిత్యానుష్ఠానముచే, ఆత్మైక్యముచే ప్రత్యక్షమగును.

991. **షడధ్వాతీత రూపిణీ :** 1. పదాధ్వా 2. భువనాధ్వా 3. వర్ణాధ్వా 4. తత్వాధ్వా 5. కలాధ్వా 6. మంత్రాధ్వ అను ఆరుమార్గములకు అతీతమైయున్న రూపమును కలిగి యున్నది.

992. **అవ్యాజకరుణామూర్తిః :** పవిత్ర దయాస్వరూపిణి.

993. **అజ్ఞానధ్వాంత దీపికా :** అజ్ఞానమనెడి చీకటికి దీపమువలె అజ్ఞానమును నశింపజేయును.

994. **ఆబాలగోప విదితా :** బాలురు మొదలు కృష్ణుని వరకు లేక సదాశివుని వరకు అందరకు తెలిసిన ఆత్మస్వరూపిణి.

995. **సర్వానుల్లంఘ్య శాసనా :** బ్రహ్మ విష్ణ్వాదులకు గూడ దాటుటకు శక్యము కాని శాసనము గలది.

996. **శ్రీచక్రరాజనిలయా :** బిందు త్రికోణాది రూపమైన శ్రీచక్రరాజము వాసస్థానముగా గలది. శరీరమందు జీవుని ఉనికి యెట్లో శక్తి శివులకు శ్రీచక్రమందు ఉనికి అట్లుగలదు.

997. **శ్రీమత్త్రిపుర సుందరీ :** త్రిపురములైన బ్రహ్మ, విష్ణు, శివపురములు గల త్రిపురుడైన పరమశివుని భార్యత్రిపుర సుందరి.

998. **శ్రీశివా :** శోభతో గూడిన శివా.

999. **శివశక్త్యైక్యరూపిణీ :** శివశక్తుల సామరస్యరూపము గలది.

1000. **లలితాంబికా :** 1. శోభ 2. విలాసము 3. గాంభీర్యము 4. మాధుర్యము 5. స్థైర్యము 6. తేజస్సు 7. లాలిత్యము 8. ఔదార్యము అను అర్థములు గల లలితాంబిక.

ఈమె ధనుస్సుచెఱకు, బాణములు పుష్పములు. అన్నియు మరి లలితములే మరియు అమిత సుందరమైన దనియు అర్థము కలదు. ప్రయాగ పీఠాధి దేవత లలిత.

సహస్రనామ స్తోత్రము చేయునప్పుడు ప్రతినామము ముందు ఓం అనియు, చివర నమః అనియు చేర్చి స్తోత్రము చేయవలెను. మరియు మొదటి నామమునకును, చివరి నామమునకు ముందు ఓం ఐం, హ్రీం, శ్రీం యని చదువవలెను. సహస్రనామములందు ఇహ, పరసంబంధమైన విషయము అన్నియు తెలుపబడియున్నవి.

ఫలశ్రుతి : హయగ్రీవాచారి అగస్త్య మహర్షికి ఫలశ్రుతియు చెప్పెను. లలితా దేవి దేవతలందరిలో శ్రేష్ఠమైనది. లలితా సహస్రనామము అన్నిటికంటె రహస్యతమమైనది.

సర్వ రోగములను శమింపజేయును. సర్వసంపదలనిచ్చును. దీర్ఘాయుష్షును, పుత్రసంతానమును, ధర్మార్థ కామమోక్షములను ఇచ్చును. భక్తితోఒక్కసారి పఠించినను అధిక ఫలితము కలుగును. యజ్ఞములన్నిటిని మించిన విశేష ఫలమునిచ్చును. గంగాది

సర్వతీర్థములందు కోటి జన్మలందు స్నానము చేసిన ఫలము లభించును. కాశీక్షేత్రమందు కోటి లింగముల ప్రతిష్ఠించిన పుణ్యము కలుగును. కురుక్షేత్రము నందు సూర్యగ్రహణకాలమున కోటి పర్యాయములు దానము చేసిన ఫలము లభించును. ఒక్క శివలింగమును స్థాపించినను విశ్వమంతటా స్థాపించినట్లగును. అన్నివిధాలా సంస్కృతులైన శ్రోత్రియ బ్రహ్మణులకు కోటి బారువుల (20 తులములు) బంగారమును దానమిచ్చిన ఫలము కలుగును.

గంగా తీరమున కోటి అశ్వమేధయాగములు చేసినంత పుణ్యము కలుగును. జలము లేని ఎడారి యందు కోటి బావులను త్రవ్వించినంత, కరవు కాలమున ప్రతిదినము కోటి బ్రహ్మణులకు అన్నదానము చేసినంత ఫలితము లభింఛను. కోటి కోటి జన్మలందు చేసిన పాపరాశి కంటె అధికమైనది కూడా నాశమగుటకు ప్రతినామమునకు శక్తి కలదు. దానిని తొలగించుటకు పదునాలుగు లోకములేకమైనను సమర్థములు గావు.

వేయి నామములను వదలి పాపహానిని కోరువారికి చలి బాధను పోగొట్టుకొనుటకు హిమవంతమును సేవించినట్లగును. అనగా ఏవిధమైన నిష్కృతిలేదు. నిత్యము పారాయణ చేయువారికి ప్రసన్నురాలై సర్వాభీష్టములను ప్రసాదించును.

పౌర్ణమి, శుక్ల నవమి, చతుర్దశి, శుక్రవారములందు పారాయణ చేయుట శ్రేష్ఠము.

వేయి అశ్వమేధయాగములు, నూరు వాజపేయములు, దేవీ పూజకు సాటి రావు. నిత్యమూ పూజించువాడు మునితో సమానుడు. మంత్రింపబడిన భస్మము సర్వరోగనివారిణి.

నిశ్చలముగా (చపలత్వము లేక) లక్ష్మి నివసించును. అన్నివిద్యలు వరించును. నామ సహస్రము నెరిగిన వానిని చూచినను సర్వపాపములు తొలగును. నామ కీర్తన చేయని వాడు, మంత్రరాజమెరుగని వాడు పశుతుల్యుడు. ఉత్తమమైన నామసహస్రమును పుస్తకమందు వ్రాసి భక్తితోనిత్యమూ అర్చించుట దేవికి ప్రియము.

రాత్రియందు చక్రరాజమందుండు దేవిని అర్చించిన లలితా దేవి రూపము సిద్ధించును. ఆశ్వీయుజ అష్టమి, నవములందు పూజించిన శోకము కలుగదు. చక్రరాజమందలి మహాదేవినర్చించిన సకల సౌభాగ్యములు లభించును. చివరకు అతి దుర్లభమైన సాయుజ్యము లలితాదేవితో ప్రాప్తించును.

జీవ, బ్రహ్మల భేదభ్రమతొలగి బ్రహ్మజ్ఞానము కలుగును. లోకవ్యవహార వచనము కంటె విష్ణునామ స్మరణం ముఖ్యం. విష్ణునామ సహస్రం కంటె ఒక శివనామం శ్రేష్ఠం. శివనామ సహస్రము కంటె దేవినామ మొక్కటియైనను ఉత్తమం.

ఒక్క మాటలో లలితమైన భావాలు కలిగి సాధింపరాని దేమియూలేనిదై, శ్రీలలితాంబికతో తాదాత్మ్యస్థితి కలుగును.

లలితాదేవి సహస్రనామాలను నిత్యమూ పఠించి తత్త్వమును అవగాహన చేసుకొని భక్తితో ఆరాధించి పునీతులమగుదుముగాక.

"శ్రీ సుందరీ సేవన తత్పరాణాం భోగశ్చమోక్షశ్చ కరస్థఏవ"

సత్యం శివం సుందరం
శివం మంగళ రూపం ఇతి శివమ్
ఓం లలితాంబికాయైనమః
ఓం శాంతి శాంతి శాంతిః
లోకాస్సమస్తాస్సుఖినోభవంతు.

## దాతలు

| | రూ॥ |
|---|---|
| శ్రీమతి కలగ రాధా దుర్గా మహాలక్ష్మి | 511-00 |
| శ్రీమతి జె.బి. పుష్ప | 110-00 |
| శ్రీ వి. చలపతిరావు, ఐ.డి.పి.యల్., | 116-00 |
| శ్రీ జి. శ్రీశైలం, ఐ.డి.పి.యల్., | 50-00 |
| శ్రీ బి. మల్లారెడ్డి, ఐ.డి.పి.యల్., | 50-00 |
| శ్రీ బి. మాధవరావు, ఐ.డి.పి.యల్., | 50-00 |
| శ్రీ శంకర రావు, ఐ.డి.పి.యల్., | 50-00 |
| శ్రీ పి. చిత్త రంజన్, ఐ.డి.పి.యల్., | 58-00 |
| శ్రీ టి. కూర్మయ్య, ఐ.డి.పి.యల్., | 58-00 |
| శ్రీ పి. నందకుమార్, ఐ.డి.పి.యల్., | 50-00 |
| శ్రీ ఎస్. అంజయ్య, ఐ.డి.పి.యల్., | 51-00 |
| శ్రీ ఎ. విశ్వనాథం (ట్రాన్స్ పోర్టు, ఐ.డి.పి.ఎల్) | 116-00 |
| శ్రీ నరసింహారావు (సాయిరాం వైన్స్, దిల్‌సుఖ్‌నగర్) | 116-00 |
| శ్రీ ఎస్. సుదర్శన్ | 151-00 |
| శ్రీ డి. సత్యనారాయణ | 116-00 |
| శ్రీ కె. రామారావు | 180-00 |
| శ్రీ వెంకటేష్ (దేవి మెడికల్స్, దిల్‌సుఖ్‌నగర్) | 50-00 |
| శ్రీ ఆర్. పెద్దిరాజు, సత్యవతి | 122-00 |
| శ్రీ భానుక జయనారాయణ | 116-00 |
| శ్రీ రేవూరి రాము, బేబి | 100-00 |
| శ్రీ సాయిరాం కమ్యూనికేషన్స్, దిల్‌సుఖ్‌నగర్ | 116-00 |
| శ్రీ ఆంజనేయులు, (త్రినేత్ర సూపర్ మార్కెట్) | 51-00 |
| శ్రీ ఎస్. లక్ష్మి నారాయణ | 25-00 |
| శ్రీ కొండూరి రామలింగయ్య | 58-00 |
| శ్రీ ఆర్. సత్యనారాయణ | 116-00 |
| శ్రీ పి. సుబ్రహ్మణ్య శాస్త్రి | 58-00 |
| శ్రీ కె. శ్యామాచారి | 111-00 |
| శ్రీ ద్వారకానాథ్ | 116-00 |
| శ్రీ టి.వి. మురళీధర్, (దేనా బ్యాంక్) | 51-00 |
| శ్రీ జి. వెంకన్న | 120-00 |
| శ్రీ సహదేవరెడ్డి (నేతి మిఠాయిలు, దిల్‌సుఖ్‌నగర్) | 150-00 |
| శ్రీ పి. చంద్రశేఖర్ రెడ్డి (మధురా స్వీట్స్, దిల్‌సుఖ్‌నగర్) | 116-00 |
| శ్రీ ఎన్.వి. రమణ మూర్తి (శ్రీ షిర్డి సాయి కంప్యూటర్స్, దిల్‌సుఖ్‌నగర్) | 116-00 |
| శ్రీ ఎమ్. నవీన్ కుమార్ (సూర్యాపేట వారి | |
| శ్రీ సాయి ప్రమోద్ జ్యూయలర్స్, దిల్‌సుఖ్‌నగర్) | 116-00 |
| శ్రీ కె. రామకృష్ణ | 116-00 |

# నా రచనలు

1. అశ్రుఝరి (కవితాసంపుటి) - 1992
2. అల (కవితాసంపుటి) - 1993
3. వ్యాస ప్రసాదం - 1994
4. కాంతి బంధం (కవితాసంపుటి) - 1995
5. లక్షణ దీపిక - 1996
6. శ్రీ సాయి కిరణాలు - 1996
7. ఆరిపోని చేవ్రాలు (కవితాసంపుటి) - 1996
8. భగవద్గీతానుశీలన - 1997
9. మైత్రీ సౌందర్యం - 1997
10. వేదమాతగాయత్రి - 1998
11. శివదర్శిని - 1998
12. ఇంకా ఏదో కావాలి - 1999
13. శ్రీ సాయి దశకం - 2000
14. శ్రీ లలితానామ సహస్రార్థము - 2000